# ఆంధ్ర ప్రదేశ్ లో

| | |
|---|---|
| జనాభా | 4,35,03,000 |
| షెడ్యూలు కులాలవారు | 57,75,000 |
| షెడ్యూలు జాతులవారు | 16,58,000 |
| విస్తీర్ణం (చ.కి.మీ.) | 2,76,754 |
| జిల్లాలు | 21 |
| తాలూకాలు | 196 |
| పట్టణాలు, నగరాలు | 224 |
| పల్లెలు | 27,221 |
| పంచాయతీలు | 15,920 |
| పంచాయతీ సమితులు | 324 |
| పార్లమెంటు సభ్యులు | 59 |
| శాసన సభ సభ్యులు (ఒక నామినేటెడ్ సభ్యునితో సహా) | 288 |
| శాసన పరిషత్తు సభ్యులు | 90 |
| విశ్వవిద్యాలయాలు | 5 |
| అక్షరాస్యులు | 1,06,90,000 |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 20 డిసెంబర్, 1975 సంచిక :
మార్గశిర—పుష్య, 1897

ప్రధాన సంపాదకులు
శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు
యన్. వి. గోపాలశాస్త్రి

పంచాయతీరాజ్ రజతోత్సవ ప్రత్యేక సంచిక

తెళల, మత ప్రచారమున తన్మ కవిత్వ
మనోజ్ఞ కల్పనో
జ్జ్వల కృతి నిర్మితిన్, రిపు విపాటన బాహు
పరాక్రమంబునన్
తెలుగు లనేక రంగములఁ దీర్చిన సేవలు
భారత ప్రసూ
విలసిత కీర్తివల్లి కొదవించె నిరంత వసంత
సంగతిన్

— డా. దివాకర్ల వేంకటావధాని

మొదటి కవరు పేజీ : పంచాయతీ రాజ్యం-ప్రజా రాజ్యం

రెండో కవరు పేజీ : నూతనోత్తేజంతో విస్తరిల్లుతూన్న పాల ప్రాజెక్టు

సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం. హెచ్/హెచ్. డి. 81

ఈ సంచికలో...



ఈ సంచికలోని రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవిగా భావించ నక్కరలేదు.

# వర్తమానం సవాలు నందుకోండి !

వర్తమానం సవాలు విన్నావా
నువ్వూ నేనూ
రేపు కోసం చేసుకున్న నిర్ణయం
ఆశ కోసం తీసుకున్న నిశ్చయం
ఈ అనంతకాలానికి
కానుకలుగా మారేదాకా
విశ్రాంతి తీసుకోవద్దంటున్నది।

జీవిత ప్రశ్న పత్రంలో
పూర్తి చెయ్యడానికిచ్చిన ఖాళీలు
నిర్ణీతకాలంలో పూరించి
ఇమ్మని మళ్ళ హెచ్చరిస్తున్నది।
విన్నావా అన్నా।
విశ్రాంతికిది కాలం కాదురా నాన్నా!
అశ్రద్ధకి ది సమయం కాదురా చిన్నా!

గుడిలో మడిలో నుడిలో
రూపొందిన
భేదాలు వాదాలు పోదాలు మరిచి
ఒకే మాటగా ఒకే బాటగా
ఒకే మూటగా
ఆశయాల్ని కలిపివేయమని
సూచిస్తున్నది
రోచిర్మయ భవిష్యత్తు

చూడు
భవిష్యత్తు ఎలా చిరునవ్వు నవ్వుతున్నదో
ఎలా అభినందనలు తెలుపుతున్నదో
నీ
గత విజయ పరంపరల పుటలు వ్రాసి
నీ
సృజనోత్సాహక్రమాల నుంచి దారాలు తీసి
వరదలో వచ్చే వాగులా పోతూ
నిలబడింది చూడు ఆగామి నీ ఎదుట।
అర్థిస్తున్నది చూడు నిన్ను
పొలాల జలాల కోసం
హలాల ఫలాల కోసం
ఆలోచించు కర్తవ్యం
ఆలోకించు గంతవ్యం।

మన కుతూహల పతాకంలా
చూశావా
సుశ్యామంగా కాంతిధామంగా
అదిగో
మన ఆగామి।
అదెలా మెరుస్తున్నదో చూడు
మన
ఎదద తీగ సుమదళాలు విరియ
మన
చెలిమి చెట్టు నవ ఫలాలు కురియ

అహింసా కరవాలంతో
అరి వీర భయంకరంగా
ఆహవాలు నడిపి
స్వాతంత్ర్య మ్మూట
భుజాల నిండా ఎత్తుకుని
హాయిగా
బాధ్యతలతో
మోసుకుంటున్న బరువులా
భావి
ఎలా ఉందో చూడు భాయీ
నిజం సుమీ ఇది కల కాదోయీ।
కోటి నిరుద్యోగాలతో
శతకోటి నైరాశ్యాలతో
అనంతకోటి దారిద్ర్యాలతో
వర్తమానం
కిట కిట లాడి పోతూంటే
భవిష్యత్తు నూహించగలరా ఎవరైనా?
అసాధ్యం। అనూహ్యం అంటావేమో
కానీ

ఆ నైరాశ్యం అక్కర్లేదు
ఆ పరిదీనత పనికి రాదు
'విసుగు లేకుండా పని చెయ్యడం'
ఇదీ నేటి నినాదం
ఇదీ నేటి సింహగర్జనం
ఇదీ నేటి ఖడ్గ శాసనం।

నేనూ అదే అంటున్నాను
వర్తమానం సవాలు నీ వేళ
అందుకున్న వాడే
అప్రతిహతంగా
పురోగమించ గలడు।
నరి కొత్త వెలుగు బాటలో
తొలి కొత్త అడుగు వేయగలడు
ఆకాశ హిమాంశు మండలంలో
ఆవాస కుతూహలం
పొంద గలడు !

శ్రీ మి రి యా ల రా మ కృ ష్ణ

# పంచాయతీ రాజ్యం ప్రజా రాజ్యం



## పంచాయతీ రాజ్య రజతోత్సవాల ప్రారంభ సందర్భంగా ముఖ్యమంత్రి సందేశం

ఇది పంచాయతీ రాజ్ రజతోత్సవ సంవత్సరం. రేపటినుంచి రాష్ట్రమంతటా పంచాయతీ రాజ్య రజతోత్సవ కార్యక్రమాలు ప్రారంభం అవుతాయి నాలుగు కోట్ల తెలుగు ప్రజలను ఒకే పాలన క్రిందకు తీసుకొని వచ్చిన ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినం నవంబరు ఒకటిన జరుపుకుంటాం ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రాన్ని ఆమోదించి పంచాయతీ రాజ్యాన్ని అమలు పరచడంలో అగ్రగామిగా వున్నది కూడా మన రాష్ట్రమే అందుచేత పంచాయతీరాజ్ రజతోత్సవ కార్యక్రమాలను మన రాష్ట్ర అవతరణ దినోత్సవం రోజున ప్రారంభించడం చాలా సమంజసం

శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీ సిఫార్సుల ననుసరించి, పంచాయతీరాజ్ వ్యవస్థను, ప్రజాస్వామ్య వికేంద్రీకరణలో భాగంగా మొదటి సారిగా చట్టరీత్యా అమలు పరచినది మన రాష్ట్రమే అసలు సమాజ వికాస కార్యక్రమంగా ప్రారంభమైన గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు, పంచాయతీ రాజ్యంగా మార్పు చెందాయి ఆచరణలో కలిగిన అనేక అనుభవాలను గుణపాఠాలుగా గ్రహిస్తూ, ఎప్పటి కప్పుడు తగిన మార్పులు చేర్పులు చేసుకుంటూ వెళ్ళాం పంచాయతీరాజ్య వ్యవస్థను గురించి అనేక విమర్శలు వచ్చాయి నా అధ్యక్షతలో ఏర్పాటైన కాంగ్రెసు శాసన సభా పక్షం ఉపసంఘం ఈ వ్యవస్థను సమగ్రంగా పరిశీలించి లోపాలను సవరించడానికి తగిన సూచనలు చేసింది తర్వాత రాష్ట్ర ప్రభుత్వం ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది శ్రీ సి నరసింహం గారి అధ్యక్షతన ఏర్పాటైన ఆ ఉన్నతాధికార సంఘంకూడా యీ వ్యవస్థను పటిష్ఠం చేయడానికి తగు సూచనలు చేసింది యీ సూచనలన్నింటినీ ఆకళింపు చేసుకొని, పంచాయతీరాజ్ వ్యవస్థను సమూలంగా సవరించే బిల్లులను ప్రవేశపెట్టాం ఈ బిల్లులు యిప్పుడు జాయింటు సెలెక్టు కమిటీల పరిశీలనలో ఉన్నాయి మన రాష్ట్రంలో పంచాయతీ రాజ్యవ్యవస్థ ఉన్నత ప్రమాణాలను అందుకున్నదనీ, పరిణతి చెందినదనీ చెప్పటానికి యీ బిల్లులే సాక్ష్యం.

మన రాష్ట్రంలో పంచాయతీలు చాలాకాలంగా పని చేస్తూ ఉన్నాయి మద్రాసు రాష్ట్రంలో 1929 లోనే పంచాయతీల చట్టం రావడంతో ఆంధ్రప్రాంతంలో అప్పటి నుంచే గ్రామ పంచాయతీలు ఏర్పడ్డాయి తెలంగాణా ప్రాంతంలో 1951 నుంచీ గ్రామ పంచాయతీలు పని చేస్తున్నాయి అయితే స్వర్గీయ శ్రీ మెహతా కమిటీ సిఫారసుల ననుసరించి మూడంతస్థుల పంచాయతీరాజ్య వ్యవస్థ అమలులోనికి వచ్చిన తర్వాతనే గ్రామీణ ప్రజానీకంలో నవ చైతన్యం జాగృతి కలిగాయనడంలో సందేహంలేదు ఈ నాడు పలు గ్రామాల్లో ఒక మంచినీటి బావి ఉన్నదన్నా ఒక ప్రాథమిక పాఠశాల ఏర్పాటైన దన్నా ప్రధానమైన రోడ్డునుంచి ఒక అప్రోచ్ రోడ్డు వేయడం జరిగిందన్నా, వైద్య సౌకర్యం అందుబాటులోకి వచ్చిందన్నా—అంతా పంచాయతీరాజ్య వ్యవస్థ కృషి ఫలితమేనని చెప్పక తప్పదు అంతేకాదు, పునాది స్థాయిలో పరిపాలనా యంత్రాంగపు వివిధ శాఖల సమన్వయాన్ని సాధించడంలో సఫలత అయినది యీ పంచాయతీ రాజ్ వ్యవస్థ ద్వారానే

### గ్రామీణ ప్రజల అభ్యుదయం

గ్రామీణ పేద ప్రజానీకం జీవన పరిస్థితిని మెరుగు పరచడానికీ, ముఖ్యంగా బలహీన వర్గాల వారికి మేలు చేకూర్చడానికీ ప్రధానమంత్రి ప్రకటించిన 20 అంశాల కార్యక్రమం క్రింద పంచాయతీలు అనేక సంక్షేమ పథకాలను చేపట్టవలసి ఉన్నది బలహీన వర్గాల వారికీ, భూములు లేని పేదవారికీ, ఇళ్ళ స్థలాలను కేటాయించే కార్యక్రమం క్రింద, భూముల సేకరణ పద్ధతులను సులభతరం చేస్తూ ఉత్తరువులు జారీ చేశాం జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులూ, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని, ఇళ్ళు లేని వారికి ఇళ్ళ స్థలాలను కేటాయించే కార్యక్రమాన్ని సత్వరం పూర్తి చేయవలసి ఉన్నది

ఈ రజతోత్సవ కార్యక్రమాల సందర్భంగా గ్రామ పంచాయతీలు తమ తమ గ్రామాలలో భూమిలేని నిరుపేదలు ఎంతమంది

ఉన్నారో, ఇళ్ళులేని వారు ఎంత మంది ఉన్నారో, వివరాలు సేకరించాలి. భూములున్న గ్రామాలలో యిళ్ళ స్థలాల కేటాయింపు కార్యక్రమాన్ని పూర్తి చేయించాలి. ప్రతి గ్రామంలో మంచి నీటి బావులు ఉన్నాయో లేవో కూడా వివరాలు సేకరించాలి. గ్రామంలో పూర్తి అయిన రక్షిత మంచినీటి పథకాలను ప్రారంభించాలి. గ్రామంలో అత్యవసర సరుకులు చౌక ధరలకు లభిస్తున్నాయా లేదా, వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు చెల్లిస్తున్నారా లేదా చౌక వస్త్రాలు లభిస్తున్నాయా లేదా, అన్న వివరాలను సేకరించి పై అధికారులకు తెలియపరచాలి.

పంతొమ్మిది రోజులపాటు కొనసాగే యీ ఉత్సవాలలో నవంబరు 14 వ తేదీన కీర్తి శేషులు, నవభారత నిర్మాత, పండిట్ జవహర్‌లాల్ జన్మదినోత్సవం కూడా వస్తుంది. ఆ రోజున విద్యార్థులు, యువకులు, బాల బాలికలను సమీకరించి, అభివృద్ధి కార్యక్రమాలలో వారికి ఆసక్తిని కలుగజేసే కార్యక్రమాలను నిర్వహించాలి. గ్రామీణ యువజన సంఘాలులేని గ్రామాలలో వీటిని ప్రారంభించాలి కళాశాలలు, పాఠశాలలు, ఇతర విద్యా సంస్థలలో ప్రత్యేక సమావేశాలు ఏర్పాటుచేసి ప్రధాన మంత్రి 20 అంశాల కార్యక్రమాన్ని వారికి విపులీకరించాలి.

మన ప్రియతమ ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినం నవంబరు 19 వ తేదీ. మన రాష్ట్రంలో పంచాయతీల రజతోత్సవ కార్యక్రమం ఆ నాటికి తార స్థాయిని అందుకోవాలి. ఆ రోజున మహిళా సంఘాలులేని గ్రామాలలో వాటిని ప్రారంభించడానికి కృషి చేయాలి

19 రోజుల యీ కార్యక్రమాలలో ఆయా శాఖల ఉద్యోగులు బలహీన వర్గాలవారికి ఉద్దేశించిన కార్యక్రమాలను ప్రత్యేక శ్రద్ధతో జరపాలి. భూములులేని పేదలకు వ్యవసాయ భూముల పట్టాలను ప్రదానం చేయటం, స్వయం ఉపాధికల్పన క్రిందగాని, పారిశ్రామికాభివృద్ధి పథకాల క్రిందగాని, ఆర్థిక సహాయం అందుకొనడానికి అర్హులైన వారందరికీ, అందుకు సంబంధించిన సంస్థలు ఆ సహాయం అందజేయటం గ్రామీణ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి పథకాలను అమలుచేయడం కొత్త చౌక దుకాణాలు ప్రారంభించడం, మొదలైన సంక్షేమ కార్యక్రమాలన్నింటినీ యీ రజతోత్సవాలలో ముమ్మరంగా సాగించాలి

ప్రజాస్వామ్య భవనానికి మూలస్తంభాలైన పంచాయతీరాజ్ సంస్థలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌ల స్థాయిలలో స్వయంగా కొన్ని సంక్షేమ పథకాలను ప్రారంభించడమేకాక, ఇతర శాఖలు చేపట్టే కార్యక్రమాలకు సంపూర్ణమైన సహకారాలు అందజేయాలి.

పంచాయతీరాజ్ సంస్థలు బలహీన వర్గాల సంక్షేమానికి ఉద్దేశించిన అనేక పథకాలను చేబట్టి తమ ఉనికిని సార్థకం చేసుకోవటమేగాక — ప్రజాస్వామ్యానికి పంచాయతీ రాజ్య వ్యవస్థ ప్రాణప్రదం అన్న వాస్తవాన్ని రుజువు పరచడంలో సఫలీకృతం కాగలవని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను.

# వెలుగుజల్లు తెలుగుతల్లి

గలగల ప్రవహించు సరిత
జననీ ! నీ దివ్య చరిత
వేనోళ్ల తా పాడుతుంది
అయిదు కోట్ల ఆంధ్ర జనత

తుంగభద్ర భంగిమలతో
కృష్ణవేణి కలకలముతో
గోదావరి నాదాలతో
నిండుతుంది నీచరిత

అమరావతి గుహాలయందు
అపురూపపు శిల్పాలు
అవిచ్ఛిన్నమై నిలచి
ఖ్యాతిని కల్పించె నమ్మ !

కదనములో తన పతికి
వీరస్వర్గ మిప్పించి
వీరపత్ని చానమ్మ
నీ కీరితి పెంచెనమ్మ !

ఆంధ్ర రత్న-ఆంధ్రశ్రీ
తమ సర్వము నొడ్డినారు
నీ కొఱకై గుండ్లకెదురు
నిలచి నాడు టంగుటూరి

కులమత నిర్మూలనకై
కృషి చేసెను బ్రహ్మన్న
సాహిత్యం ప్రజలకడకు
కొని తెచ్చెను వేమన్న

ఛాందసుల సంతవీడి
కొత్త పుంత త్రొక్కి వ్రాసె
వ్యవహారిక భాషనందె
పదా లెన్నో గురజాడ

రమ్యంగా గేయాలను
వ్రాసినాడు రాయప్రోలు
వ్యవహారిక భాషలోనె
నిజంగానె ఒలుకు తేనె

లేదమ్మా నిన్నుబోలు
స్థల మెందును భూతలమున
కాదమ్మా నీకు సాటి
ఏ దేశము ప్రపంచమున

నీదు చరిత నిత్య సరిత
ఆంధ్ర భూమి! అగ్రగామి !
తెలుగు తల్లి! కల్పవల్లి !
కొనుము నాదు ప్రణుతి నీవు

వెలుగు జల్లు తెలుగు తల్లి
నీదు చరిత నీదు ఘనత
కీర్తింతుము—దీవించుము
మము భారత ప్రియ పుత్రీ!!

—రాధశ్రీ



# నూతన శకోదయం

శ్రీ పి. రంగారెడ్డి

మధురమైన జనగణమన గానం గుడిగంటల శబ్దతరంగాల మాదిరిగా వీనుల విందుగా వాయువులో లీనమైంది. ఇటీవల ప్రకాశం జిల్లాలోని సౌభాగ్యవంతమైన గ్రామ శివారులో నేను పాల్గొన్న ఉత్సవం యీ జాతీయ గీతంతో ముగిసింది నీలి ఆకాశంలో మిట్ట మధ్యాహ్నం ఎఱ్ఱని సూర్యుడు నిర్దాక్షిణ్యంగా నిప్పులు కురిపిస్తున్నాడు. మా బృందం మెల్లగా సమీప గ్రామానికి బయలు దేరింది. మరో ఉత్సవంలో పాల్గొనడానికి

కొత్తగా నిర్మించబడిన పాఠశాల భవనం ధవళ కాంతులతో మెరిసిపోతోంది ఆ రోజున దానిని సర్వాంగ సుందరంగా అలంకరించారు జనసమూహం—ముఖ్యంగా ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలు—ఆనందోత్సాహంతో మైమరచి నృత్యం చేస్తున్నారు వాతావరణమంతా సంతోషంతో నిండి ఉంది అంతలో ఒక ఎద్దుబండి మెల్లని నడకతో అలంకరించబడిన పాఠశాల ద్వారం ముందుకు వచ్చింది వెనువెంటనే హర్షధ్వానాలు, ఆనందోత్సాహాలు మిన్నుముట్టాయి గ్రామంలోని ఇటీవల నిర్మించబడిన ఏకైక పాఠశాలలో కొత్తగా నియమించబడిన ఉపాధ్యాయుడు వచ్చాడు అందుకే ఆ ఆనందం, ఉత్సాహం, జనసందోహం

కొత్తగా నిర్మించబడిన గ్రామ పాఠశాలకు ఉపాధ్యాయుడు రావడం మనకంత ప్రత్యేకమైన సంఘటనగా అనిపించకపోవచ్చు అయితే నవనాగరికతకు దూరంగా ఉన్న మారుమూల గ్రామంలో అమాయకులైన ప్రజలకు యిదొక ఆశ్చర్యకరమైన సంఘటనగా తోచవచ్చు. ఆ ప్రాంతంలో ప్రజల చిరకాల వాంఛ నెరవేరింది. ఆశించిన ఆశయాలను పూర్తి చేయడమే పంచాయతీ రాజ్య వ్యవస్థ ప్రధాన లక్ష్యం విశాల దృక్పథంతో ఆలోచిస్తే కొత్త పాఠశాలకు కొత్తగా ఉపాధ్యాయుడు నియమించబడడం పంచాయతీ రాజ్య వ్యవస్థ పనిచేస్తున్నదనడానికి చక్కని నిదర్శనం

## పంచాయతీరాజ్ సంస్థల ప్రభావం

ఈ దృష్ట్యా గత పాతిక సంవత్సరాలలో గ్రామీణ భారత దేశంపై పంచాయతీరాజ్ సంస్థల ప్రభావాన్ని మదింపు వేసి ప్రశంసించవచ్చు ఒక గ్రామ పాఠశాలగానీ, ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రంగానీ, ఒక మహిళామండలి గానీ, ఒక మంచినీటి బావిగానీ పంచాయతీరాజ్ వ్యవస్థకు, దాని కార్యనిర్వహణకు ప్రతీకగా ప్రస్ఫుటంగా నిలుస్తాయి

స్వేచ్ఛా భారత నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ, 1956 లో విశాల ఆంధ్రప్రదేశ్‌కు ప్రారంభోత్సవం చేసి దక్షిణాది తెలుగువారంతా,తాము ఎంతోకాలంగా కలలు గన్న రీతిని కలిసిపోయి తమ భవిష్యత్తును తామే తీర్చిదిద్దుకోవడానికి అవకాశం కల్పించారు ఈ లక్ష్యసాధనకే 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ఆతర్వాత తెలుగు ప్రజలు వెనకడుగు వేయకుండా తమ నూతన లక్ష్యాల సాధనకు ప్రగతి పథంలో పయనించారు. ఇది ఎన్నో అడ్డంకులు, అగాథాలను అధిగమించి పయనించాల్సిన నిరంతర ప్రయాణం అనడంలో సందేహంలేదు అయితే యిది ఉత్సాహపూరితంగాను ఫలవంతంగాను సాగింది

గత 19 సంవత్సరాలుగా నిర్దేశిత లక్ష్యాల సాధనకు మనం నిరంతరంగా కృషి చేస్తూ వచ్చాం. విజయనగర సామ్రాజ్య వైభవ ప్రాభవాలనూ మన సంస్కృతినీ, పునరుద్ధరిస్తూ స్వర్గసీమలాంటి విశాలాంధ్రను నిర్మించుకోవాలని మనం కలలుగన్నాం ఈ మహత్తర లక్ష్యానికి రూపకల్పన చేయడానికి యింతకాలంగా మన శక్తియుక్తులన్నిటినీ ధారపోసి కృషిచేశాం ఈ విషయంలో మనం చాలావరకు కృతకృత్యులమైనాం దీనికి మనం గర్వించాలి

## దక్షిణాది ధాన్యాగారం

దక్షిణదేశపు ధాన్యాగారం అనే ఖ్యాతిని మన రాష్ట్రం నిలుపుకుంది 1974–75 వ్యవసాయ సంవత్సరంలో రికార్డుస్థాయిన 27 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తి కావడమే దీనికి నిదర్శనం 1975–76లో యింకా ఎక్కువ ఉత్పత్తి అయ్యే అవకాశాలు ఉన్నాయి ప్రైవేటు, పబ్లిక్ రంగాలలో పరిశ్రమల సత్వరాభివృద్ధికి తగిన వాతావరణాన్ని మనం కల్పించాం. తదనుగుణంగా రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడానికి ఉద్దేశించిన సాధారణమైన, ప్రాధాన్యతాపూర్వకమైన అనేక ప్రోత్సాహక చర్యల ఫలితంగా పారిశ్రామికవేత్తలను ఆంధ్రప్రదేశ్ ఎంతగానో ఆకర్షించడానికి అవకాశం ఏర్పడింది

విద్యుచ్ఛక్తి ఉత్పాదన, పంపిణీ ఎక్కువగా ఉంటే సత్వర పారిశ్రామికీకరణకు అవకాశం ఏర్పడుతుందనే ఉద్దేశంతో ఐదవ పంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తి రంగానికి గణనీయమైన మొత్తాలను కేటాయించారు. దీనివల్ల వ్యవసాయ అభివృద్ధికి కూడా దోహదం ఏర్పడింది. తద్వారా రెండు రంగాలూ పురోగమిస్తే ఆర్థిక వ్యవస్థ పటిష్టమవుతుంది.

ఈ దృషితో చూస్తే రూ. 190 కోట్ల 1975–76 వార్షిక ప్రణాళిక మరో ముందడుగుగా భావించాలి. ఈ పెట్టుబడిని రూ 151 కోట్ల నుండి 190 కోట్లకు పెంచారనే విషయాన్ని మనం మర్చిపోరాదు ఈ మొత్తం 1973–74 కన్నా రెండింతలు 1974–75 పెట్టుబడి కన్నా 28 శాతం ఎక్కువగా గత సంవత్సరపు ప్రణాళికా పెట్టుబడి పెరుగుదల రాష్ట్ర చరిత్రలోనే అత్యున్నతమైనది. ఈ విధంగా ప్రణాళికా యుగంలో నూతనశకోదయమైంది.

గత కొన్ని సంవత్సరాలుగా అధికోత్పత్తి సాధించడం వల్లనూ. రాష్ట్ర ప్రణాళిక పెట్టుబడుల నిమిత్తం ఆదనపు వనరులను సృష్టించడంలో రాష్ట్ర ప్రభుత్వం జరిపిన నిరంతర కృషివల్లనూ, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వనరులలో పెరుగుదల ఏర్పడి తద్వారా రాష్ట్ర ప్రణాళికకు ఎక్కువ మొత్తాలను కేటాయించడానికి అవకాశం కలిగిందని నేను భావిస్తున్నాను. గత అనుభవాలవల్ల ప్రోత్సాహం కలిగి, పెద్ద ఎత్తున ప్రణాళికలను రూపొందించి, ఎక్కువ ఫలసాయాన్ని పొందాలనే ఆలోచనా స్థాయికి మనం వచ్చాం. రాష్ట్ర అవతరణ దినోత్సవం శుభసమయాన యీ ఆలోచన మనందరికీ ప్రోత్సాహం కల్గించాలని నేను ఆశిస్తున్నాను.

## ప్రధాని నూతన కార్యక్రమం

పైగా, యిది మనం విశ్రమించాల్సిన సమయం కాదని గుర్తించాలి. మన దేశంలో యిటీవల జరిగిన సంఘటనల ఫలితంగా అత్యవసర పరిస్థితి ప్రకటించడం, ప్రధానమంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం అవతరించడం, జాతి శ్రేయస్సు దృష్ట్యా మనమై మనం అన్ని విధాలైన క్రమశిక్షణను ఏర్పరచుకోవడం వంటి విషయాలు సంభవించి, స్వేచ్ఛా భారత దేశ చరిత్రలో అపూర్వమైన ఘట్టాలుగా నిలిచాయి. మరో విధంగా చెప్పాలంటే జాతి బృహత్తర ప్రయోజనాల నిమిత్తం వ్యక్తుల బృందాల ప్రయోజనాలు తలవొంచాల్సిన సమయాలు ఒక జాతి చరిత్రలో వస్తాయనే వాస్తవాన్ని యివి చాటిచెప్పుతున్నాయి అన్ని విషయాలకన్నా జాతి శ్రేయస్సు చాలా ముఖ్యం. అందువల్ల మన నాయకులు తరచుగా చెప్పుతున్న విధంగా యిటీవల జరిగిన సంఘటనలను యిదే విధమైన సరిఅయిన దృష్టితో గమనించాలి.

కొత్తదానికి చోటు యిస్తూ పాత వ్యవస్థ మారుతూంటుంది నిన్నటి బూజు, అవరోధాలు, అడ్డంకులను వెనక్కునెట్టి వేయడం జరుగుతుంది. భారతదేశం పూర్వపు ఔన్నత్యాన్ని చూరగొని నూతన శకోదయానికి నాంది పలుకుతుంది మన ప్రధాని 20 సూత్రాల కార్యక్రమం ఈ మార్గంలో మొదటి సోపానం మన మందరం ఉజ్వల భవిష్యత్తుకై శక్తివంచన లేకుండా కృషిచేద్దాం

## ఈ సంచికలో రచయితలు

శ్రీయుతులు

మిరియాల రామకృష్ణ, తెలుగు లెక్చరర్, ప్రభుత్వ కళాశాల, రాజోలు, తూ. గో. జిల్లా.

వావిలాల గోపాలకృష్ణయ్య, అధ్యక్షులు, అధికార భాషా కమీషన్, సచివాలయం, హైదరాబాద్.

గోరాశాస్త్రి, సంపాదకులు, "ఆంధ్ర భూమి", సికింద్రాబాద్.

తిరునగరి, కవితాసదన్, పోచమ్మవాడ, ఆలేరు, నల్గొండ జిల్లా.

కె. ఆర్. కె. మోహన్, జూబిలీ పోస్టాఫీస్. హైదరాబాద్.

సిద్దాని నాగభూషణం, ఎ. పి. ఆర్. 2., సమాచరశాఖ, హైదరాబాద్.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదారాబాద్.

జి. కృష్ణమూర్తి, టి. పి. ఆర్. ఒ. పెరవలి సమితి, తణుకు, తాలూకా పశ్చిమ గోదావరి జిల్లా.

సి. ఆనందారామం, ఎస్. టి. 26, మారేడ్‌పల్లి, సికిందరాబాద్.

పి. సరళాదేవి, 5–2–39, వి. డి .ఒ శిక్షణ కేంద్రం, బాపట్ల, గుంటూరు జిల్లా.

ముదిగొండ వీరభద్రమూర్తి. 13–6–665, కారవాన్‌సాహు, హైదరాబాద్.

టి. కృష్ణమూర్తి, టీచర్, కార్మిక సంక్షేమ కేంద్రం, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.

జి. రామకృష్ణారావు, ఎం. ఎస్. 91, మలక్‌పేటకాలనీ, హైదరాబాద్.

జీడిగుంట వెంకట్రావు, 4–3–108/3, దేవీదీన్‌బాగ్, హనుమాన్ టేకిడి హైదారాబాద్–1.

వి. సంపత్కుమారాచార్య, బి. ఏ., ముద్దు డాబాలవీధి, కొవ్వూరు, తూర్పు గోదావరిజిల్లా.

# ఆంధ్ర ప్రదేశ్ లో పంచాయతీరాజ్ సంస్థలు

శ్రీ ఎల్. లక్ష్మణదాసు

స్వతంత్రం రాగానే మనం రాజ్యాంగాన్ని రచించుకొన్నాం. ప్రపంచంలోకెల్లా పెద్దదైన ప్రజాస్వామ్య వ్యవస్థను రూపొందించుకొన్నాం. సంక్షేమ రాజ్యాన్ని నెలకొల్పుకోవాలన్నది మన లక్ష్యం. ప్రణాళికాబద్ధంగా అభివృద్ధిని సాధించుకుంటూ, సాంఘిక–ఆర్థిక పరిణామాన్ని, సాంఘిక న్యాయాన్ని సమకూర్చుకోవాలన్నది మన ఆశయం. 'ఆదేశిక సూత్రాలు' అనే పేరుతో మన రాజ్యాంగములో అమూల్యమైన ఆశయాలను రచించుకున్నాం. అలాంటి ఆదేశిక సూత్రాలలో ఒకటైన 40వ ఆర్టికలులో–గ్రామ పంచాయతీలను ఏర్పాటుచేయడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవాలనీ, ప్రభుత్వ రంగాలుగా అవి పని చేయడానికి అవసరమైన అధికారాలు వారికి దత్తం చెయ్యాలని విధించారు. 1950 జనవరి 26వ తేదీన రాజ్యాంగాన్ని ఆమోదించగానే రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాన్ని అనుసరించి అప్పటివరకు గ్రామ పంచాయతీలు లేని రాష్ట్ర ప్రభుత్వాలు గ్రామ స్థాయిలో గ్రామ పంచాయతీలు ఏర్పాటు చేశాయి. అనుభవాలను పురస్కరించుకొని ఎప్పటికప్పుడు రాష్ట్రప్రభుత్వాలు తమ తమ రాష్ట్రాలలో గ్రామ పంచాయతీలను స్థాపించి ప్రభుత్వంలో సమర్థవంతమైన అంగాలుగా రూపొందించడానికి చట్టాలను సవరించుకుంటూ వెళ్ళాయి. దేశమంతటా గ్రామ పంచాయతీలు ఏర్పాటై 25 సంవత్సరాలు పూర్తి అయిన దృష్ట్యా ఈ సంవత్సరం దేశమంతటా పంచాయతీల రజతోత్సవాలను మనం జరుపుకుంటున్నాం. ఆంధ్రప్రదేశ్ అవతరించిన రోజు, నవంబరు 1వ తేదీన ఈ ఉత్సవ కార్యక్రమాలు ప్రారంభం కావడం విశేషం.

దేశానికి స్వతంత్రం వచ్చిన కాలంలో ఎటు చూచినా నిరాశాజనకమైన పరిస్థితి తాండవిస్తుండేది– తీవ్రమైన పేదరికం, అవిద్య, అనారోగ్యం, అధ్వాన్నమైన కమ్యూనికేషన్లు, వ్యవసాయంలో స్వల్పమైన పంట, బలహీనమైన పారిశ్రామికరంగం అత్యవసర సరుకులకు కూడా విదేశాల మీద విపరీతంగా ఆధారపడవలసి రావడం మొదలైన వాటిని తలచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది, జాతీయ జీవనంలోని అనేక రంగాలలో ప్రణాళికా లక్ష్యమైన అభివృద్ధి సాధించడమే ఆనాటి జాతీయ ప్రభుత్వపు తక్షణ కర్తవ్యమైంది. ప్రజల జీవన ప్రమాణాన్ని–ముఖ్యంగా గ్రామీణ ప్రజల జీవిత ప్రమాణాన్ని మెరుగు పరచాలన్న తీవ్రమైన ఆకాంక్ష ఇందుకు దోహదంచేసింది. ఈ మహత్తరమైన అభివృద్ధి ప్రక్రియలలో ఆర్థిక సాంఘిక ప్రగతికి, బలహీనవర్గాల సంక్షేమానికి ప్రజా సహకారంతో, ముఖ్యంగా ప్రాతినిధ్య సంస్థల తోడ్పాటుతో కార్యక్రమాలను నిర్వహించవలసిన అవసరం ఏర్పడింది. ఈ పద్ధతిలో సాముదాయకాభివృద్ధి కార్యక్రమాలకు నాందీ ప్రస్థాపన జరిగింది.

## సాముదాయకాభివృద్ధి కార్యక్రమాలు

1952 అక్టోబరు 2వ తేదీన మన దేశంలో సాముదాయకాభివృద్ధికార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. వివిధ అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజల సహకారాన్ని పూర్తిగా పొందడం, సామాన్య మానవుని జీవన ప్రమాణాన్ని పెంపొందించడమే ఈ సాముదాయకాభివృద్ధి కార్యక్రమాల ప్రధాన లక్ష్యం. గ్రామీణ ప్రజానీకం జీవితాలలో ప్రధానంగా ఆర్థిక, సాంఘిక విప్లవాన్ని సాధించాలనేది దీని ఆశయం. ప్రారంభంలో ఈ కార్యక్రమాలు చాలా విజయవంతముగా అమలు జరిగాయి. అయితే ఈ ఆసక్తిని కొనసాగించడం సాధ్యం కాలేదు. ఆ కార్యక్రమాల ప్రధాన లక్ష్యమైన ప్రజా సహకారాన్ని నిరంతరం పొందడం వీలు పడలేదు. ఈ కార్యక్రమాలకు పునరుజ్జీవనం కలుగజేయవలసిన ఆవశ్యకత, సమీక్షించుకోవలసిన అవసరం కలిగింది. ఈ పరిస్థితులలో 1957లో గ్రామీణ సమస్యలను పరిశీలించి, తగిన సూచనలను చేయడానికి బల్వంతరాయ్ మెహతా కమిటీని నియమించారు. క్షుణ్ణంగా పరిశీలన జరిపిన మీదట, ఈ కమిటీవారు జిల్లా స్థాయికన్నా దిగువ స్థాయిలో, చట్టబద్ధమైన ఎన్నుకోబడిన సంస్థలను ఏర్పాటు చెయ్యాలని సిఫారసు చేశారు. పరిపాలనా రంగాన్ని వికేంద్రీకరించి, గ్రామ స్థాయిలో గ్రామ పంచాయతీని, బ్లాకు స్థాయిలో పంచాయతీసమితిని, జిల్లా స్థాయిలో జిల్లా పరిషత్తును, ఇలా మూడు అంతస్థులుగా ఎన్నుకోబడిన సంస్థలను రూపొందించాలన్న ఈ సూచనను కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. ప్రజాస్వామ్య వికేంద్రీకరణగా ప్రాచుర్యం పొందిన ఈ పద్ధతికే, ఆధునిక భారత నిర్మాత మన ప్రియతమ నాయకుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, 'పంచాయతీరాజ్' అని నామకరణం చేశారు. ప్రజాస్వామ్యం అంటే ప్రజలలో నుంచి వెల్లివిరిసే అధికారం అనే ఈ నూతన విధానం, పరిపాలనా వ్యవస్థ కూడా నూతన వైఖరితో రూపొందాలని పాలనాధికారం ప్రజలకే చెందాలని ఆయన ఆశయం. ఈ సంస్థలను ఒకవేళ అవి ఏవైనా పొరపాట్లు చేసినప్పటికీ రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా బలపరచాలన్నది ఆయన అభిప్రాయం. పరి

పాలనా పద్ధతులను అభ్యసించే అవకాశం ప్రజలకు లభించాలనీ, అందులో వారు శిక్షణ పొందాలనీ ఆయన ఆశయం.

కీర్తి శేషులైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సంపూర్ణ సహకార ప్రోత్సాహాలు అండగా, మన రాష్ట్ర ప్రభుత్వం, జిల్లా పరిపాలనా యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించడంలో దేశానికే మార్గదర్శకం కావాలన్న సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నది. మన రాష్ట్రంలోని 20 జిల్లాలో నూ జిల్లాకు ఒక్కొంటికి ఒకబ్లాకుగా ఎంపికచేసి, ఆ బ్లాకులలో అడ్‌హాక్ పంచాయతీ సమితులు స్థాపించారు. ఇవి పనిచేసిన తీరును పరిశీలించి ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టాన్ని 1959 లో అమలు చేయడం జరిగింది. ఈ చట్టం క్రింద మూడు అంతస్థుల పంచాయతీరాజ్ సంస్థలు చట్ట ప్రకారం రూపొందాయి.

## పంచాయతీరాజ్ సంస్థల కృషి

1959 నుంచి 1964 వరకూ పంచాయతీరాజ్ సంస్థలు చాలా బాగా పనిచేశాయి. గ్రామీణ ప్రజానీకంలో వీటిపట్ల మహోన్నతమైన ఆశలూ, ఆకాంక్షలూ పెంపొందాయి. పంచాయతీరాజ్ సంస్థలకు అప్పగించిన అభివృద్ధి కార్యక్రమాలను సమర్థవంతంగా అమలువరిచారు. ఈనాడు ఒక గ్రామంలో స్వంతభవనం గల ప్రాథమిక పాఠశాల ఉన్నదన్నా, వైద్య సదుపాయం చికిత్స అందించగల వైద్యశాల ఉన్నదన్నా, గ్రామానికి చేరుకోవడానికి ఒక అప్రోచ్ రోడ్డు ఉన్నదన్నా, మంచినీటి సౌకర్యాన్ని అందించే మంచినీటి బావి ఉన్నదన్నా, పంచాయతీ రాజ్య సంస్థల కృషివల్లనే ఇదంతా సాధ్యమైనదన్న విషయాన్ని విస్మరించరాదు. ముఖ్యంగా విద్య, వ్యవసాయం, గ్రామీణ ఆరోగ్యం, రోడ్డు, సౌకర్యాలు మొదలైన విషయాలలో ఈ సంస్థలు చేసిన కృషి సాధించిన విజయాలు అపూర్వమైనవి. అయితే 1964 తర్వాత పంచాయతీరాజ్ సంస్థలు తమ ఉత్సాహాన్ని కోల్పోయాయి. అనేక కారణాలవల్ల ప్రజా సహకారాల్ని పొందలేక పోయాయి. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు శాసనసభా పక్షం, శ్రీ వెంగళరావు నాయకత్వాన నియమించిన కమిటీ, రాష్ట్రప్రభుత్వం శ్రీ సి. నరసింహం అధ్యక్షతన ఏర్పాటు చేసిన ఉన్నతాధికార సంఘం ఈ సంస్థలు పనిచేస్తున్న తీరును క్షుణ్ణంగా అధ్యయనం చేసి, వీటిని పునరుజ్జీవింప చేయడానికి అనేక సిఫారసులు చేశాయి. ఈ రెండు కమిటీల సిఫారసులనూ, ప్రాంతీయ సమ్మేళనాలలో పంచాయతీరాజ్ కార్యకర్తలు చేసిన సూచనలనూ, చట్టాలను అమలు చేయడంలో అనుభవ రీత్యా వచ్చిన సమస్యలనూ దృష్టిలో ఉంచుకొని, మన ప్రభుత్వం ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల చట్టాన్ని, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టాన్ని–1975 ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల సవరణ బిల్లు ద్వారా సవరించాలని సంకల్పించింది. ఇప్పుడే రెండు బిల్లులూ ఉభయ శాసన సభల సంయుక్త సెలెక్టు కమిటీ పరిశీలనలో ఉన్నాయి.

పంచాయతీరాజ్ కార్యకర్తలకు మరింత శక్తిని ప్రదానం చేసి స్థానిక ప్రభుత్వ విభాగాలుగా వారు సమర్థవంతమైన పాత్ర నిర్వహించడానికి దోహదం చేసే బిల్లులలోని ప్రధానాంశాలను ఇక్కడ పేర్కొనడం అవసరం. పంచాయతీరాజ్ సంస్థల పదవులకు జరిగే ఎన్నికల పద్ధతిలో చేసిన మార్పులు ఇందులో అత్యంత ప్రధానమైనవి. ప్రస్తుతం గ్రామ పంచాయతీ సర్పంచ్‌ని, గ్రామపంచాయతీ సభ్యులు ఎన్నుకుంటున్నారు. సవరణ బిల్లులో గ్రామంలోని మొత్తం ఓటర్లందరూ కలిసి సర్పంచ్‌ని ఎన్నుకోవడానికి ఏర్పాటు చేయబడింది అలాగే పంచాయతీ సమితి అధ్యక్షుని పంచాయతీ సమతి సభ్యులూ, జిల్లా పరిషత్తు అధ్యక్షుని జిల్లా పరిషత్తు సభ్యులూ, ఎన్నుకునే పద్ధతి ప్రస్తుతం అమలులో ఉన్నది. సవరించిన చట్టం క్రింద ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ అధికారి పర్యవేక్షణలో కిందికి తీసుకురాబడతారు. ఈ మార్పువల్ల వివిధ అభివృద్ధిశాఖలమధ్య సమగ్రమైన సమన్వయాన్ని సాధించడంతోపాటు వివిధ కార్యక్రమాలను పర్యవేక్షించడంలోనూ, మార్గదర్శకత్వం వహించడంలోనూ ఇప్పుడు అమలులో ఉన్నటువంటి శాఖాధిపతుల పర్యవేక్షణా, పంచాయత్ రాజ్ సంస్థలపర్యవేక్షణా అనే ద్వంద్వ విధానం స్థానే నిరంతరమైన సమగ్ర పర్యవేక్షణా విధానాన్ని ప్రవేశపెట్టాలని ప్రతిపాదించబడింది. జిల్లా స్థాయిలో ప్రతిపాదించిన ఈ నూతన పాలనా వ్యవస్థక్రింద ప్రస్తుతం పదవిరీత్యా జిల్లా పరిషత్తు సభ్యుడుగానూ, అన్ని స్థాయీ సంఘాల అధ్యక్షుడుగానూ వ్యవహరిస్తున్న జిల్లా కలెక్టరు ప్రమేయాన్ని పంచాయతీరాజ్ సంస్థల విషయంలో తొలగించడం జరుగుతుంది. పంచాయతీసమితుల జిల్లా పరిషత్తుల స్థాయి సంఘాలకు, ఆయా సంఘాలు ఎన్నుకునే అధ్యక్షులు విడిగాఉంటారు.

## పంచాయతీ సిబ్బందికి ప్రత్యేక స్థాయి

అభివృద్ధి కార్యక్రమాలుగానీ, సంక్షేమ కార్యక్రమాలుగానీ విజయవంతంగా అమలుజరగాలంటే ఉద్యోగుల సంతృప్తి ప్రధానం. పంచాయతీరాజ్ సంస్థకు-ప్రస్తుత పరిపాలనా వ్యవస్థలో ఎక్కువ మంది సిబ్బందిని విభిన్న శాఖలనుంచి తీసుకోవడం జరుగుతున్నది. ఇందువల్ల వారికి పంచాయతీరాజ్ సంస్థలపట్ల ప్రత్యేక ఆసక్తిగానీ, అభిరుచిగానీ ఉండటంలేదు. సమగ్రమైన పాలనకు అవసరమైన రక్షణనుగానీ, శ్రద్ధనుగానీ కలుగజేయడానికి వీలు లేకుండా పోతున్నది. అందుకని పంచాయతీరాజ్ అధికారుల ప్రత్యేక కేడర్‌ను రూపొందించాలనీ ప్రభుత్వం సంకల్పిస్తున్నది. ఇందువల్ల అవసరమైన రక్షణ, ప్రమోషన్ అవకాశాలు పెరిగి, ఈ సంస్థల కార్యకలాపాల పట్ల అధికారులలో శ్రద్ధాసక్తులు, సద్భిత, ఉత్సాహం పెంపొందడానికి వీలు కలుగుతుంది.

ప్రభుత్వ వనరులనూ, పంచాయతీరాజ్ సంస్థల వసతులనూ, ఇతర ఆర్థిక సహాయ సంస్థల వనరులనూ సమీకరించి, పంచాయతీ రాజ్ ఆర్థిక సహాయ సంస్థలను రూపొందించాలనికూడా ప్రభుత్వం ప్రతిపాదిస్తున్నది. ఈ సంస్థలు చేపట్టబోయే ప్రత్యేక లాభదాయకమైన పథకాలకు ఋణ సహాయాన్ని దీనిద్వారా సమకూర్చుకోవడానికి అవకాశం కల్గుతుంది. రాష్ట్రంలోని పంచాయతీరాజ్ సంస్థలను పునర్వ్యవస్థీకరించి, పునరుజ్జీవింపజేయడంలో పైన పేర్కొన్న చర్యలనేకం దోహదం చేయగలవు.

ప్రస్తుత జాతీయ అత్యవసర పరిస్థితిలో పంచాయతీరాజ్ సంస్థలు ప్రముఖపాత్ర వహించవలసి ఉన్నవి. ప్రధాన మంత్రి

శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం మన సాంఘిక ఆర్థిక లక్ష్యాల విషయంలో స్పష్టమైన మార్గదర్శకత్వాన్ని కలుగజేస్తూ నూతన సార్థకతాభావాన్ని పెంపొందించింది. మన లక్ష్యాలనూ, విధానాలనూ మరోసారి ఉద్ఘాటించడంతోబాటు, ఈ కార్యక్రమం అభివృద్ధి కార్యకలాపాల రంగంలో నూతన శ్రద్ధాసక్తులనూ, చిత్తశుద్ధితో కృషిచేయాలన్న భావననూ కలుగజేసింది. భారతదేశం అభివృద్ధికి కీలకం గ్రామీణ ప్రాంతాలే కనుకనూ, వెనుకబడిన వర్గాలవారి సమస్యలు గ్రామీణ ప్రాంతాలలోనే క్లిష్టదశలో ఎదురౌతూ ఉంటాయి కనుకనూ — యావత్తు దేశం ఆర్థిక ప్రగతిని, సమాజంలోని వెనుకబడినవర్గాలవారి ప్రయోజనాలను పరిరక్షించి ముఖ్యంగా ఈ వర్గాలవారి అభివృద్ధిని రక్షిస్తూనే నూతన ఆర్థిక కార్యక్రమం, పంచాయతీరాజ్ సంస్థలపైన గురుతరమైన బాధ్యతలను మోపుతున్నది పంచాయతీరాజ్ సంస్థలు అత్యంతకీలకమైన పాత్ర నిర్వహించవలసి ఉన్నది. అన్నిటికన్నా ప్రధానమైనది — వ్యవసాయ రంగంలో పంటలను పెంపొందించడంలోనూ, సాంఘిక సమానత్వం సాధించడంలోనూ రెండు విధాలుగా విప్లవం తీసుకొనిరావలసి ఉన్నది.

## 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం

20 అంశాల కార్యక్రమాన్ని అమలుపరిచే విషయంలో పంచాయతీరాజ్ సంస్థలు ప్రధానమైన బాధ్యతలు వహించవలసి ఉంటుంది. 20 అంశాల కార్యక్రమంలోని అన్ని అంశాలకూ విరివిగా, విస్తృతంగా ప్రచారం కలుగజేయడం వారి ప్రప్రథమ కర్తవ్యం. ఈ కార్యక్రమాన్ని గురించి గ్రామీణ ప్రజానీకానికి విపులీకరించడానికిగాను గ్రామ సభలన్నింటినీ ఆదేశించడం జరిగింది. అదేవిధంగా జిల్లాపరిషత్తులూ, పంచాయతీలూ, పంచాయతీ సమితులు తమ తమ సర్వసభ్యసమావేశాలు జరిపి, 20 అంశాల కార్యక్రమాన్ని చర్చించుకోవడం, విపులీకరించుకోవడం చేస్తారు. పైన పేర్కొన్నటువంటి సమావేశాలను 1975 నవంబరు 21 వ తేదీ నుంచి 19వ తేదీవరకు నిర్వహించాలని పంచాయతీరాజ్ సంస్థలకు ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.

20 అంశాల కార్యక్రమంలోని వివిధ అంశాలకు సంబంధించి, రాష్ట్ర ప్రభుత్వం అనేక ఆదేశాలనూ, ఉత్తర్వులనూ జారీచేసింది. ఉదాహరణకు వెట్టిచాకిరీ రద్దు, అత్యవసర సరుకుల పంపిణీ, మిగులు భూముల పంపకం, బలహీనవర్గాలవారికి ఇండ్ల స్థలాల కేటాయింపు, గ్రామీణ ప్రాంతాలలో ముఖ్యంగా బలహీనవర్గాలవారి నుంచి రావలసిన అప్పులను వసూలు చేయడంలో సంవత్సరం పాటు మారిటోరియమ్ మొదలైనవి. ఈ చర్యలన్నింటినీ రెవిన్యూశాఖ, సహకారశాఖ, సాంఘిక సంక్షేమశాఖ, వ్యవసాయశాఖవంటి ఆయా ప్రభుత్వ శాఖలకు సంబంధించిన అధికారులే తీసుకున్నప్పటికీ ప్రజా ప్రాతినిధ్య సంస్థలుగా, పంచాయతీరాజ్ సంస్థలు వివిధ స్థాయిల్లో ప్రభుత్వాధికారులతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకొని, ఈ కార్యక్రమాల అమలులో వారికి సలహాలు చెప్పడం, సమన్వయ పరచడం, పర్యవేక్షించడంవంటివి చేయవలసి ఉంటుంది. ప్రభుత్వ కార్యక్రమాన్ని అమలుపరచే విషయంలో ఈ సంస్థలు పర్యవేక్షణా సంస్థలుగా పనిచేసి, లోపాలు కనపడగానే అందుకు సంబంధించిన అధికారులకు తెలియజేయవలసి ఉంటుంది.

ప్రస్తుత జాతీయ అత్యవసర పరిస్థితుల దృష్ట్యా పంచాయతీరాజ్ సంస్థలు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించడంలో విఫలం కాబోవనీ, జాతీయ నాయకులు వీటినుంచి ఆశించిన ఆశయాలను ఫలింపజేయగలవనీ, అభివృద్ధి కార్యక్రమాలన్నింటిని అమలుచేసి ప్రజాసామాన్యం తమ మీద నిలుపుకున్న ఆశలన్నిటినీ విజయవంతంగా నిర్వర్తించగలవనీ ఆశిస్తున్నాను గ్రామీణ భారతంలో విప్లవాన్ని, ఆర్థిక ప్రగతిని సాధించడానికి సమాజంలోని బలహీన వర్గాల అభివృద్ధికి ఉద్దేశించిన కార్యక్రమాలు అమలు జరగవలసిన ఆవశ్యకత ఉన్నది

---

**1974 సంవత్సరానికి**

## ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు

కవిత : "ఆమ్రపాలి"–కళాప్రపూర్ణ ఎస్.టి. జ్ఞానానందకవి

కథానిక : "సీతాకళ్యాణం"–శ్రీ ముళ్లపూడి వెంకటరమణ

నాటకం. "కళ్ళు"–శ్రీ గొల్లపూడి మారుతీరావు

సాహిత్య విమర్శ : "సమాజము–సాహిత్యము"–శ్రీ ఆర్ ఎస్. సుదర్శనం.

---

# భారతదేశం ఆర్థిక స్వయం సమృద్ధి సాధించాలి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

దేశ సంక్షేమానికి అధికోత్పత్తి ఎంత అవసరమో అట్లే దేశ ఆర్థిక సుస్థిరతకూ స్వయం సమృద్ధికీ ఎగుమతి. దిగుమతుల వ్యాపార సరళి కూడా అంత ప్రధానమే. భారత దేశంలోని పంచవర్ష ప్రణాళికల సందర్భంగా ఉత్పత్తిని పెంచి, ఈ నాటి ఆత్యయిక స్థితిలో మరింత ఉధృతంగా ఉత్పత్తి పెంచవలసిన అవసరాన్ని గుర్తు చేస్తూ, కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం లోక సభకు ఒక ఆర్థిక సమీక్ష 30–7–75 న అందజేశారు. దానితో పాటు 31–7–75 న ప్రధాని ఇందిరాగాంధీ 20 సూత్రాల ప్రణాళికపై మాట్లాడుతూ ప్రపంచ వ్యాప్తంగా వున్న నోట్ల ముమ్మరం (ఇన్‌ఫ్లేషన్) ఇతర దేశాలతో పోల్చుకొని చూసుకుంటే మనం చాలా మెరుగుగా వున్నామని, 1975 ఏప్రిల్‌నుండి నేటివరకు వివిధ దేశాలలో వున్న స్థితిగతులు సమీక్షించారు. సోషలిస్టు దేశాల ఆర్థిక విధానం మనకు భిన్నమయినదన్నారు. ఇన్‌ఫ్లేషన్ పరువులెత్తుతున్న ఇన్‌ఫ్లేషను భారత దేశంలో 1974 ఏప్రిల్‌లో వార్షికంగా 14 6 శాతం వుంటే 1975 ఏప్రిల్‌లో 14 4 శాతం వుందని, అభివృద్ధి దేశాలలో పోల్చుకొని చూస్తే అది 12 3 శాతం వున్నదల్లా 11,8 శాతంకు తగ్గినదని బడుగుదేశాలలో పరిస్థితి 20 4 శాతం నుండి 26 8 శాతంకు వచ్చిందన్నారు. పరిస్థితులు ఈ విధంగా వుండగా ఇండియాలో 1974 ఏప్రిల్‌లో 30,1 శాతంగా వున్నది 1975 ఏప్రిల్‌కు 6 5 శాతం దగ్గర నిలిచివుందన్నారు. అదే 12 జూలై 1975 నాటికి 2,1 శాతంకు తగ్గిందన్నారు. అయితే మే జూన్‌లలో మరల పెరుగుదల ముఖంపట్టిందని అయినా యితర దేశాలకన్నా నయమని, అమెరికాలో 10 1 నుండి 10 3కు పెరిగిందని, ఇంగ్లాండులో 15,2 నుండి 21.7 కి పెరిగిందని మరి ఇప్పుడది 40 నుండి 45 శాతంవరకు పెరిగిందని, యుగొస్లోవికాయాలో 19 నుండి 23 శాతం పెరిగిందని, అర్జంటీనాయాలో 1 20 నుండి 68 05 శాతంకు పెరిగిందని, బ్రెజిల్ లో 25,2 నుండి 31 5 శాతంకు పెరిగిందని చిలీలో మరివారెట్లా జీవిస్తున్నారోగాని 1974 ఏప్రిల్‌లో 747 శాతంకు పెరిగిందని, ఇపుడు 3 718 శాతం వుందని, ఇక ఇస్రాయెలులో 426 శాతంలో వుందన్నారు.

ఈ వివిధ దేశాల ఆర్థిక పరిస్థితి పరికించితే ఇది ప్రపంచ వ్యాప్తమయినదని భారత దేశం ఈ ప్రవాహంనుండి తట్టుకోవాలెనని ఈ పరిస్థితులనుండి దేశం తమాయించుకోవలెనంటే అధికోత్పత్తి చేయడం, ఎగుమతులు పెంచుకోవడం ఒక్కటే గత్యంతరం అన్నారు.

## దిగుమతులు—ఎగుమతులు

అందుకై ఆలోచించి ఈనాటి ఆర్థిక విధానం ఎగుమతి దిగుమతుల ననుసరించి చేసుకొనే ఆలోచనతో సాగాలెనన్నారు. అందువల్ల ఎగుమతులు చేసే వస్తువులను అందుకు కావలసిన ముడి సరుకులు యంత్ర సామగ్రి వాటికి ప్రాధాన్యమివ్వడానికి నిశ్చయించారు. గత నాలుగు సంవత్సరాలలో జరిగిన ఎగుమతి దిగుమతుల పరిణామం కూడా గమనించవలసివుంది.

(కోట్ల రూపాయలలో)

| సం. | దిగుమతి | ఎగుమతి | తేడా |
|---|---|---|---|
| 1970–71 | 1634 | 1535 | — 99 |
| 1971–72 | 1824 | 1608 | — 216 |
| | (11 6) | (22 6) | |
| 1972–73 | 1867 | 1970 | + 103 |
| | (2 4) | (22 5) | |
| 1973–74 | 2925 | 2523 | — 402 |
| | (56,4) | (28 0) | |
| 1974–75 | 4348 | 3253 | —1095 |
| | (48.6) | (28·9) | |

ఒక్క 1972–73 సంవత్సరం ఏప్రిల్ మినహా మిగిలిన నాలుగు సంవత్సరాలలో దిగుమతులే ఎక్కువ అయిపోయాయి అని తేలుతున్నది. (బ్రాకెట్లలోవి గత సంవత్సరానికి శాతం) ఈ లోటు పూరించుకోవడంలోనే మనదేశ ఆర్థిక సుస్థిరత వుంటుంది అనేది ప్రాథమిక ఆర్థిక సూత్రం అనేదానిలో అనుమానం లేదు. 1974–75 ఎగుమతులు 28.9 శాతం పెరగడం గమనించదగిన విషయం. అయితే వస్తువులు అధికంగా పంపడంవల్లనే కాకుండా వస్తువుల ధరలు పెరగడంవల్ల కూడా దాని ప్రభావం కనిపించుచున్నది. 1973–74 నుండి 1974–75 లో మన దేశ వస్తువులను ఆముదం, చేపలు, తోళ్ళు చర్మం వంటి వాటికి మినహా గిరాకీ లభించింది. అదికూడా ఈ 2528 కోట్లనుండి 3253 కోట్లవరకు అందుకోవడానికి సహాయపడింది. ఆ విధంగా పెరిగిన ధరలు 1973–74–1974-75 లవి (హిందూ 19–8–75 న) ఈ విధంగా వున్నాయి.

## ఎగుమతి వస్తువుల ధరలు

(రూపాయలలో)

| వస్తువు | 1973_74 | 1974_75 |
|---|---|---|
| చక్కెర (టన్ను) | 1267 | 1687 |
| నార .. | 4047 | 5064 |
| తేయాకు (కిలో) | 7.65 | 9 86 |
| వస్త్రాలు (. మీ.) | 2 49 | 3.52 |
| చేతి వస్త్రాలు .. | 4 60 | 5.87 |
| ఇనుము (టన్ను) | 55.75 | 88.60 |
| మాంగనీస్ .. | 118.30 | 164.00 |
| జీడిపప్పు .. | 14157 | 18215 |
| మైకా (కిలో) | 9.94 | 11.84 |
| సుగంధ ద్రవ్యాలు (టన్ను) (మిరియాలు, ధనియాలు) | 8670 | 11708 |
| ఆముదాలు (టన్ను) | 8541 | 9307 |

ఇంతవరకు ఎగుమతి దిగుమతి తేడాలు, మన వస్తువుల గిరాకీ వల్ల మనకు లభించిన ప్రయోజనాలు చూడగలిగాం. ఈ గిరాకీ ధరలు మన ఆర్థిక విధానం మీద ఎటువంటి ప్రభావం కలిగించినవో కూడా గమనించుటకు అసలు ఈ 1974 ఏప్రిల్, 1975 ఏప్రిల్ అంటే ఇప్పటి వరకు జరిగిన పరిణామాలు పరిశీలన చేద్దాం టోకు ధరలు 1961లో నూరుగా అంచనా వేసి అధికార అంచనాలు ప్రభావం ప్రతివారికి, నెలా, సంవత్సరానికి వేస్తూంటారు. ఆ విధంగా వేసిన ధరల ప్రకారం డిసెంబరు 73లో 300.6గా వుండి 74 నవంబరులో 375.6గా వుండి 74 డిసెంబరులో 369.7గా వుండి 1974 మే నెలలో 340.7 పాయింట్లుగా వున్న ఆహారధరలు 1975 ఏప్రిల్‌లో 361.1గా వుండి 1975 మేనెలలో అవి 371.1గా వున్నవి. ఒక్క ఆహార ధరలు కాకుండా 1973 డిసెంబరులో 262.0 వుంటే 74 నవంబరులో 319.8, 74 డిసెంబరులో 317.3గా వున్న అన్ని వస్తువుల ధరలు గమనించితే 1974 మేనెలలో 298 9 వుంటే, 1975 ఏప్రిల్‌లో 308 8గా వుండి అదే 1975 మేనెలలో 313గా వున్నవి. అందుకే శ్రీ సుబ్రహ్మణం 1975 ఏప్రిల్ నెలలో ధరలు పెరుగుదల ముఖం పట్టినవన్నారు. 13_7_74న వున్న 265.2 పాయింట్లు 14_6_75న 322 పాయింట్లకు ఆహార పదార్థాలు పెరిగి, 5_7_75కు 364 8కు న్నూ 12_7_75కు 359.6 వరకున్నూ తగ్గింది. అదే ధోరణిలో ఆలోచిస్తే అన్నివస్తువులు 19_7_74న 314 1 వుంటే 12_7_75న 307 6కు తగ్గినవి. 1973 డిసెంబరులో 284.3 వుండి, 1974 డిసెంబరులో 338.4కు పెరిగినవి. 1974 డిసెంబరులో 320 3గా వున్న పంచదార మాత్రం 291 5 నుండి 324 2కు అంటె 32 పాయింట్లు పెరిగింది. అట్లే వంటచెరుకు, దీపాల ఖర్చులు 312 నుండి 346 అంటె 34 పాయింట్లకు పెరిగినవి చక్కెర వగైరాలు ఇక్కడ పెరిగిన వాటి ఫలితంగానే మనకు విదేశ మార్కెటులో కూడా దాని ప్రభావం కలగడం, ధరలు రావడం ఎగుమతులలో కాస్త అర్జన కనిపించడం సంభవించింది. ఎగుమతి దిగుమతి తేడాలు కొంత సరిదిద్దటానికి సహాయ పడింది. అయితే ఈ దేశంలోని గిరాకీతో మన ఆర్థిక వ్యవస్థ ఎగుమతి దిగుమతుల సరిదిద్దుకో దలంచితే అసలు దేశంలోని ఆర్థిక వ్యవస్థ మరల ఇన్‌ఫ్లేషన్ బారి పడకుండా చూచుకోవలెను. ఆ విషయంలో హెచ్చరిక వహించ వలసి వుంటుంది

ఈ ధరల వరలు_ఎగుమతి దిగుమతులు సమరస పద్ధతిగా దేశ ఆర్థిక వ్యవస్థను సరిదిద్దుకోవడానికి ఇతర మార్గాలతో బాటు అధికోత్పత్తి_ఉన్నవస్తువులు సమ బద్ధంగా పంపకం జరగడం, ధరలు జనసామాన్యానికి అందుబాటులో వుండేటట్లు చూడడం దేశ భక్తి పూరిత కర్తవ్యాలు సాగించ వలసివుంది 20 సూత్రాల ప్రణాళికలో ఇది కూడా ఒక భాగంగా వుండనేవుంది అందువల్ల అనధికారులు, అధికారులు వ్యాపారులు పరస్పర క్రమశిక్షణలో చొరవతో సహకార సంప్రదింపులతో, ప్రజాసహకారంతో, ప్రజలు భాగస్వాములుగా పాల్గొనే పద్ధతిలో సాగించి సాధించవలసివుంది. దేశ ఆర్థిక వ్యవస్థను సుస్థిరం చేసుకోవడం ఎంత ముఖ్యమో దేశ సార్వభౌమాధికారాన్ని కూడా రక్షించుకోవలసిన బాధ్యత మరింత హెచ్చుగా వుందని ప్రపంచ పరిస్థితులు హెచ్చరిస్తున్నవి అందుకు ప్రజలు అధికారులు, అనధికారులు కలిసి మెలిసి సాగి సాధించాలి

## క్రమశిక్షణ మన తక్షణ కర్తవ్యం

## భారతజాతిని వందరోజుల్లో చైతన్యవంతం చేసిన

# అత్యవసర పరిస్థితి

ప్రస్తుతం దేశంలో కొనసాగుతున్న అత్యవసర పరిస్థితిని "నూతన స్వరాజ్యం" గా అభివర్ణించారు మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ. ఇది పూర్తిగా నిజం. ప్రగతి సాధనకు మరింత క్రమశిక్షణతో కృషి జరపడానికి అవకాశం ఇచ్చింది అత్యవసర పరిస్థితి. అత్యవసర పరిస్థితి అమలులోకి వచ్చినదాదిగా వందరోజుల్లో ప్రభుత్వం విశేష ప్రాముఖ్యంగల ఎన్నో నిర్ణయాలు తీసుకొన్నది. ఈవందరోజుల్లో తీసుకొన్న నిర్ణయాలు, జరిగిన సంఘటనలు మన జాతీయ జీవనంలో గుణాత్మకమయిన మార్పుకు కారణభూత మయ్యాయి. జాతీయ జీవనంలోని ప్రతి రంగంపైనా చెరగని ముద్ర వేసింది యీమార్పు. ఈ వందరోజుల్లో దేశంలో ఎక్కడాకూడా అల్లర్లుగానీ, అశాంతిగానీ తలయెత్తలేదు. మత సంబంధమయిన ఉద్రిక్తతలుగానీ, ప్రాంతీయ భాషా విభేదాల సంబంధమైన ఉద్రిక్తతలు మచ్చుకైనా కానరాలేదు. అత్యవసర పరిస్థితి ద్వారా సాధించిన సత్ఫలితాలలో ఇది అత్యంత ముఖ్యమైనదని చెప్పవచ్చు.

ప్రధానమంత్రి ప్రకటించిన ఇరవై అంశాల కార్యక్రమం లక్ష్యాలు రెండు. రాజకీయ ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠం చెయ్యడం, భారతదేశ అభివృద్ధికి పరిరక్షకంగా శీఘ్ర ఆర్థిక ప్రగతిని సాధించడం—ఇవీ ఈ లక్ష్యాలు. ఈ కార్యక్రమంక్రింద స్థూలంగా నాలుగు రకాల చర్యలు తీసుకోబడుతున్నాయి. అవి ఇవి గ్రామీణ ప్రజల పరిస్థితిని మెరుగుపరచి వ్యవసాయోత్పత్తి పెంచే చర్యలు, పట్టణ ప్రాంతాల ప్రజల ప్రయోజనానికి ఉద్దేశించిన చర్యలు. ధరలను తగ్గించడంద్వారా గ్రామీణ, పట్టణ ప్రాంతాల ప్రజల ప్రయోజనార్థం చేపట్టే చర్యలు, సాంఘిక ఆర్థిక నేరాల నిర్మూలనకు ఉద్దేశించిన చర్యలు. గ్రామీణుల రుణ భారాన్ని నిర్మూలించి వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలనుండి నిరుపేద గ్రామీణులను విముక్తం చేసేందుకు తీసుకొన్న చర్యలవల్ల తరతరాలుగా వస్తున్న హేయమైన వెట్టిచాకిరీ పద్ధతికి గట్టి దెబ్బ తగిలింది. వ్యవసాయ కార్మికుల వేతనాలను పెంచడానికి తీసుకొంటున్న చర్యల లక్ష్యంకూడా ఇదే.

భూసంస్కరణల విషయంలో గత ఇరవయ్యేళ్ళలో సాధించలేని సత్ఫలితాలు గత మూడు నెలల్లో సాధించామని నిస్సందేహంగా చెప్పవచ్చు. భూమిలేని కార్మికులకు ఇళ్ళస్థలాలు కేటాయించే కార్యక్రమం అన్ని రాష్ట్రాలలో శీఘ్రంగా సాగుతున్నది. ఆదాయం పన్ను పరిమితిని సంవత్సరానికి రూ. 8 వేలకు పెంచడంవల్ల పట్టణ ప్రాంతాలలో నిర్ణీతమైన ఆదాయం తెచ్చుకొనే మధ్యతరగతి ప్రజానీకానికి కొంత ఊరట కలిగింది. పబ్లిక్ పంపిణీ వ్యవస్థను క్రమబద్ధం చెయ్యడంవల్ల ధరలలో వచ్చిన తగ్గుదల కూడా వీరికి ప్రయోజనకారిగానే ఉన్నది.

ఇక పరిశ్రమలు, కార్మిక సంబంధాల రంగం విషయానికి వద్దాం. పరిశ్రమల నిర్వహణలో కార్మికులకు భాగస్వామ్యం కల్పించడానికి సంబంధించిన పథకాలకు నాంది జరిగింది. ఈ పథకం అమలు జరపడంలో కార్మిక సంఘాలవారు హృదయపూర్వకంగా సహకరిస్తున్నారు. పరిశ్రమలలో సమ్మెలు, లాకౌట్లు జరిగే రోజులు గతించిపోయాయి. అత్యవసర పరిస్థితికి పూర్వం దేశంలో ఎక్కడ చూచినా కన్పించిన ఘెరావోలు పారిశ్రామికాభివృద్ధిని నిరోధించే ఇతర పద్ధతులు అత్యవసర పరిస్థితి ప్రకటనానంతరం పూర్తిగా అదృశ్యమయ్యాయి. ఇందువల్ల పారిశ్రామికోత్పత్తి బాగా పుంజుకొన్నది. కార్మికులకు, యాజమాన్యానికీ మధ్య ఎంతోకాలంగా వివాద కారణంగా ఉంటూ, పారిశ్రామికోత్పత్తిని దెబ్బ తీసిన బోనస్ అంశాన్ని కార్మిక మంత్రిత్వశాఖవారు పునర్నిర్వచించారు. లాభం ప్రాతిపదికగా, లేక ఉత్పత్తి, ఉత్పాదనల ప్రాతిపదికగా చెల్లించవలసిన బోనస్‌ను స్పష్టీకరించారు. ఇది పారిశ్రామిక వేత్తలనూ, కార్మికులనూ రెండు వర్గాలవారినీ—సంతృప్తిపరుస్తుంది. నిరుద్యోగులైన యువకులకు ఉపశమనం కలుగచేసేందుకు అప్రెంటిస్ షిప్ పథకాలను పెద్దయెత్తున చేపట్టడం జరుగుతున్నది.

రైల్వే వ్యవస్థ నిర్వహణను క్రమబద్ధం చేసేందుకు రైల్వే మంత్రిత్వశాఖ వారు చర్యలు తీసుకొన్నారు. ఫలితంగా ప్రధానమైన రైళ్ళు నిర్ణీత వేళలకు నడుస్తున్నాయి. రైల్వే గిడ్డంగులలో సరుకులు దీర్ఘకాలం పడి ఉండడాన్ని నిరోధించేందుకుగానూ ఒక ఆర్డినెన్సు జారీ చేశారు.

సరుకులను విడిపించుకోవలసినవారు సరుకులు గమ్యస్థానానికి చేరుకొన్న వారం రోజులలోగా వాటిని విడిపించుకోకపోతే, వాటిని వేలం వెయ్యడానికి ఈ ఆర్డినెన్సు వీలు కల్పిస్తున్నది.

దొంగ రవాణా వ్యాపారుల అక్రమ నిల్వకు, నల్లబజారు వ్యాపారానికి పాల్పడే వ్యాపారుల ఆటలు కట్టించడానికి తీసుకొనే

శ్రీ గోరా శాస్త్రి

చర్యలను బాగా ఉధృతం చేశారు. ఈ చర్యల ఫలితంగా ప్రభుత్వ ఖజనాల ఆదాయం పెరుగుతుందనడంలో ఏమాత్రం సందేహంలేదు.

ఆర్థిక, సాంఘిక రంగాలకు సంబంధించి ప్రభుత్వం తీసుకొనే చర్యలు ఏవైనప్పటికీ, అవి సత్ఫలితాల నివ్వాలంటే పరిపాలనా యంత్రాంగం సమర్థవంతగా, నిజాయితీగా ఉండాలి. ప్రభుత్వోద్యోగులు శ్రమించి పనిచెయ్యాలి. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అసమర్థులను, అవినీతిపరులను ప్రభుత్వ సర్వీసు నుంచి ఏరివెయ్యడానికి ఉద్యమస్థాయిలో చర్యలు ప్రారంభించాయి. ఈ చర్యలు ప్రభుత్వ సర్వీలలోని అవాంఛనీయ ఉద్యోగుల ఏరివేతకు తప్పకుండా తోడ్పడాయి. పరిపాలనలో అనవసరమైన ఆలస్యాలకు ఏమాత్రం తావులేకుండా చేస్తాయి. ఈ విషయాలన్నింటి దృష్ట్యా చూస్తే ప్రధానమంత్రి ప్రకటించిన ఇరవై అంశాల కార్యక్రమం భవిష్యత్తు పట్ల నూతనాశలనూ, నమ్మకాన్నీ చిగురింపచేసిన ఒక మహాద్భుత పథకం అని చెప్పవచ్చును.

ప్రధాని ప్రకటించిన నూతన ఆర్థిక కార్యక్రమం క్రింద మనరాష్ట్రంలో జరిగిన ప్రగతిని పరిశీలిద్దాం ఈ కార్యక్రమం క్రింద వివిధ రంగాలకు సంబంధించి తీసుకోదలచిన చర్యలన్నింటినీ అమలుపరచడానికి మన రాష్ట్ర ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకొన్నది. వీటి ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. ప్రజలకు అత్యవసరసరకుల పంపిణీ న్యాయంగా సమంగా జరిగేలా చూచి, ధరల పెరుగుదలను నిరోధించే ఉద్దేశ్యంతో మన రాష్ట్ర ప్రభుత్వం వారు అన్ని తాలూకా ప్రధాన కార్యస్థలాలలోనూ వాడకందారు దుకాణాలు తెరవడానికి ఉధృతస్థాయిలో చర్యలు తీసుకొంటున్నారు. విద్యార్థులకు పుస్తకాలు, ఎక్సర్సైజ్ పుస్తకాలు, తెల్లకాగితాలు మొదలైన వాటిని చౌక ధరలకు సరఫరా చెయ్యడానికి కూడా చర్యలు తీసుకొంటున్నారు. బియ్యం సేకరణ కార్యక్రమం అతి శీఘ్రంగా కొనసాగుతున్నది. ఈ చర్యల ఫలితంగా ధరలు తగ్గుముఖం పట్టాయి.

అమానుషమైన వెట్టి చాకిరీ పద్ధతిని మన రాష్ట్ర ప్రభుత్వం రద్దు చేసింది. వ్యవసాయ కార్మికుల కనీస వేతనాలను పెంచింది. గ్రామీణ ప్రజలు చెల్లించవలసిన ఋణాలపై ఒక సంవత్సరంపాటు 'మారటోరియం' విధించింది. ప్రస్తుతం వ్యవసాయ కార్మికుల, వృత్తి పనివారల ఆధీనంలో ఉన్న ఇళ్ల స్థలాలలో వారు ఇళ్లు కట్టుకొనేందుకు హక్కు ఇస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీ చేసింది.

ఇప్పటికే ఉన్న, నిర్మాణం పూర్తి కావలసిన పెద్ద, మధ్య తరహా నీటిపారుదల ప్రాజెక్టులకు మరింత పెద్ద మొత్తాలలో నిధులు కేటాయించడం జరిగింది. అచిర భవిష్యత్తులో సుమారు ఏడు లక్షల హెక్టార్ల భూమికి సాగు నీటి సౌకర్యం కల్పించడం ఈ చర్య లక్ష్యం.

మధ్యాదాయ, అల్పాదాయ వర్గాల ప్రజలకు గృహాలు నిర్మించేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఒక కార్యక్రమాన్ని చేపట్టింది. మురికి వాడల నిర్మూలనకు కూడా ఒక కార్యక్రమం తయారవుతున్నది. జంటనగరాలను అభివృద్ధి పరచడానికిగానూ ఇటీవలనే ఒక సంస్థ (అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ) ను ఏర్పాటు చేశారు చేనేత పనివారి స్థితిని మెరుగుపచడానికి రాష్ట్ర ప్రభుత్వం ఒక సంస్థను ఏర్పాటు చేసింది. చేనేత వస్త్రాలను విదేశాలకు ఎగుమతి చెయ్యడం యీ సంస్థ లక్ష్యం.

ప్రధానమంత్రి ప్రకటించిన ఇరవై అంశాల కార్యక్రమం క్రింద మన రాష్ట్రంలో జరిగిన ప్రగతి ఇది. ఈ కార్యక్రమాన్ని త్వరితగతిని అమలు పరచడంలో మనరాష్ట్రం ఇతర రాష్ట్రాలకన్నా ఏమాత్రం తీసిపోలేదనీ వెనుకబడలేదనీ, దీన్నిబట్టి తెలుసుకోవచ్చు.

యావద్భారత జాతినీ తమ నాయకత్వం ద్వారా చైతన్యవంతం చేశారు మన ప్రధాని. ఆమె నాయకత్వంలో మనదేశం అచిర భవిష్యత్తులోనే బ్రహ్మాండమైన ప్రగతి సాధించి అభివృద్ధి చెందిన దేశాల కోవలో చేరుతుందని రూఢిగా చెప్పవచ్చు.



# కవికోకిల జాషువా - గబ్బిలము

"గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయచేత న
న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే?
ఇవ్వసుధాస్థలిం బొడమరే రసలుబ్ధులు? గంటమూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్"

అని సమకాలీన కవిపండితుల నెదురొడ్డి, వాళ్ళ ఈర్ష్యాద్వేషాలను లెక్కింపక కమనీయ కవితా గానం చేసి తెలుగు దేశాన్ని ఉఱ్ఱూతలూగించిన మహాకవి గుఱ్ఱం జాషువా. ఆయన కవిత్వం పండితపామర జనరంజకమై తెలుగువాళ్ళ నాలుకల మీద నాట్యమాడడానికి ఆయన సాధించుకున్న శైలీ రమ్యతయే కారణం. ఆ మీసాల పొంకమూ, ఆ ముఖంపై ప్రస్ఫుటించే బింకమూ, ఆయన నవ్వులోని చల్లదనమూ, అంతరాంతరాలలో ప్రవహించే సౌజన్య భావమూ జాషువా వ్యక్తిత్వంలోనే కాదు ఆయన కవిత్వంలో కూడా సాక్షాత్కరిస్తాయి. ఆయన సాంప్రదాయ పద్ధతిలో కవిత్వం చెప్పినా, ఇటీవలి ఆధునిక కవిత్వాన్ని "ఈ చిత్తుల లోకపీకుడు కవిత్వపు పొక్కిననాదరించెదన్" అని వ్రాక్రుచ్చినా తాను కవితా ధర్మాన్ని మరచిపోయి మళ్ళీ కల్పనాకథలూ ప్రబంధాలూ సృష్టించలేదు. కవిగా సంఘాన్ని సంస్కరించడానికి, అస్పృశ్యతను నివారించడానికి ఆయన ఆజన్మాంతం కృషిచేశాడు. జాషువా కవితలో నిండైన జాతీయత, సాంప్రదాయబలమూ, అభ్యుదయ దృక్పథమూ దర్శనమిస్తుంది.

ఈ కవి రచనల్లో అశేష ప్రచారం పొందిన కావ్యం, ఆయనకు విశేషఖ్యాతిని తెచ్చిపెట్టిన కావ్యమూ "గబ్బిలము." ఇది రెండు భాగాలు. అస్పృశ్యతా నివారణం కోసం కవి ఈ కావ్యరచన చేశాడు. తెలుగు దేశంలోని హరిజనుల స్థితిగతులను బాగా అర్థం చేసుకొని ఆవేదన పొందిన కవి కాళిదాసు మేఘ సందేశము పొక్కిలో యీకావ్యాన్ని రచించాడు. చీకటిలో హరిజనుని గుడిసెలోకి ప్రవేశించి దీపమార్పిన గబ్బిలంతో బ్రహ్మచారియైనవాడు సృష్టికర్తయైన పరమ శివునికి సందేశమంపుతాడు. తనకు జరుగుతున్న అన్యాయాలన్నింటినీ గబ్బిలంతో చెప్పుకుంటాడు.

'కులము లేని నేను కొడుకుల బుట్టించి
యీ యభాత మందె త్రోయవలెనె
భార్యయేల పుట్టు బానిస కనివాడు
బ్రహ్మచర్య దీక్ష జరుపసాగినాడని' కవి ఆవేదనతో వచిస్తాడు

గబ్బిలంతో కవి స్పృశించని వస్తువే లేదనిపిస్తుంది. గబ్బిలం పయనించే మార్గంలోని ప్రతి స్థలాన్నీ, పట్టణాన్నీ, నదినీ, పురావైభవాన్నీ, ప్రస్తుత దౌర్భాగ్యాన్నీ, ఆయన వర్ణించిన తీరు ఆశ్చర్యం కలిగిస్తుంది. గబ్బిలాన్ని హంపీ క్షేత్రం చూచి పొమ్మన్న తీరు చూడండి పద్యంలో—

హంపీ క్షేత్రము జూచి పోవలయునమ్మా తెల్గురాజ్యంపు నై
లింపశ్రీల కొకానొకప్పుడది కేళీరంగమే తద్రమా
శంపావల్లరులారి పోయిన ప్రదేశంబందు నీ బందుగుల్
కొంపల్గట్టి నివాసముండెదరు నీకుంగూర్తు రానందమున్
పరదా పద్ధతి మాన్పి రోసిరికి గుప్పల్ పోసి యంగళ్ళ యం
దురు మాణిక్యములమ్మినారచట మున్నో పక్షిణీ! మూరు రా
యర గండండు మహేంద్ర వైభవముతో నాంధ్రక్షమా
మండలిం బరి పాలించిన నాటి పెంపును దలపన్
మేను గంపించెడిన్

ఈ విధంగా జాషువా మహాకవి కావ్యంలో గత చరిత్ర కవితా ధునిగా జాల్వారుతుంది. ఆయన సాహిత్య పారావారాన్ని మధించిన కృషీవలుడు. చరిత్రలన్నింటిని పుక్కిటబట్టిన చారిత్రిక వేత్త. సర్వమతాల విశేషాలనూ తెలుసుకోవాలని పట్టుబట్టిన మేధావి. జీవితాన్ని శాస్త్రీయ దృక్పథంతో సందర్శించినవాడు. ఇవన్నీ మనకు 'గబ్బిలము' లో దర్శనమిస్తాయి. ఆయన ఢిల్లీ నగరాన్ని వర్ణించిన పద్యంలో ఆయన చారిత్రిక విజ్ఞానం, పౌరాణిక పరిజ్ఞానం చక్కగా కన్పిస్తుంది.

ముడిచెనిచ్చట కుంతికొడుకు ద్రోవది కొప్పు
పగవాని రుధిరంబు పరిమళింప
మెఱసె నిచ్చోట నాదరుషా కుఠారంబు
నిఖిల భారతము కన్నీరు నింప
వెలసె నిచ్చోట పచ్చల బర్హి పీఠంబు
షాజహాన్ రాజు నాస్థానవాటి
పెండ్లాడెనిచ్చోట పృథ్వీరాజొకరోజు
జయచంద్రు సుతను దోస్సారగరిమ

తిరునగరి

యుగయుగాల కథల నుదరాన జీర్ణించి
రాజరక్త నిర్ఝరముల దేలి
నవ్వుచున్న ఢిల్లి నగరంబు నందంబు
తరుగలేదు శిరము నెరియలేదు

పాటి మానవుల కష్టాలనూ, కన్నీళ్ళను చూస్తూ రాళ్ళలోపలి దైవాలకు పూజలు చేసే మూఢులనూ, స్వార్థపరులనూ ఈ కవి బాహాటంగా విమర్శిస్తాడు.

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరత మేదిని ముప్పది మూడుకోట్ల దే
వత లెగబడ్డ దేశమున భాగ్య విహీనుల క్షుత్తులారునే?
అని ప్రశ్నిస్తాడు.

నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
ధర్మశీలురున్న ధరణి మీద

సుఖం, శాంతి నిరుపేదలకెలా లభించగల దంటాడు. మనిషి, మనిషిని ప్రేమించినప్పుడే, ఒకరి కష్టాలకు మరొకడు కన్నీరు కార్చినప్పుడే భువి దివిలా మారుతుందని ఆయన విశ్వాసం.

జాషువా కనిపించని దేవునికన్నా, కనిపించే మనిషిలోనే దేవుడున్నాడని పదే పదే చెప్పుతాడు. ఆయన మూఢనమ్మకాలనూ, జాతిని పట్టి పీడించే రుగ్మతలనూ గబ్బిలములో చాలచోట్ల వ్రాశాడు. మచ్చుకొక పద్యం

పూజారి బోషాణమున కాపలాకాయు
చిల్లరవేల్పుల సేవజేసి
గొర్రెపోతుల నల్లజొత్తి గబ్బునద్రేచు
కరకు సత్తులకు జాతరలుసల్పి
ఏటేట పెండ్లి సేయించు కొంచుదయించు
కృతకరాముల పల్లకీలు మోసి
నిలువు దోపిడి చేసి తలకాయ గొరిగించు
ఏడుకొండల వాని మేడలెక్కి
అంబుధీశుని కళ్యాణులని తలంచి
ముంచు గంగమ్మలకు దబ్బు పోసిపోసి

పాతకము పోగొట్టుకునే భక్తులను వాస్తవంలోకి తొంగి చూడమంటాడు.

గుత్తాలకు తెక్కలుగల
వెట్టియుగాల్ దాటిపోయె విజ్ఞానంబున్
బుజ్జగల గాంధియుగమిది
కత్తులు ఖడ్గంబులేలగా లేవు ప్రజన్

అని నియంతృత్వాన్ని ఈ పద్యంలో హెచ్చరిస్తాడు. ఆయన 'రాజభాషలకన్న రాష్ట్ర భాషలలోన రసమున్నదని' యధార్థత నెఱిగిన వాడు

మాతృ భాషల కర్హమర్యాదలొనరించు
సర్వకళా శాల సాగుచోటు
ప్రజల నాహరించు బహుమత దేవతా
దైన్యందిన గ్లాని లేనిచోటు
నవనీత నిభమైన కవుల కమ్మని వాక్కు
వెలపులేకావిర్భవించుచోటు
సంతానమునకు వైషమ్యంబునేర్పని
తల్లి దండ్రులు విరాజిల్లుచోటు
విసపు నవ్వుల లాహిరి వేషగాండ్ర
పాద చిహ్నాల మరకలేర్పడనిచోటు

భోగు లాహారించు భుక్తి కన్నుల జూచి
పరమ పేదలు దుఃఖ పడనిచోటు
సాంఘికాచార పంచాస్య గర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు
జాతి వైషమ్య రాక్షస పవాహతి జేసి
కందక కళలు పెంపొందుచోటు
పరిపాలక క్రూరతర కరాసికి లొంగి
పోక స్వేచ్ఛా లక్ష్మి పొదలుచోటు

అనద బిడ్డలు జూడ నెయ్యంపు సుతుల
ముద్దు లాడని గుణనిధుల్ బుట్టుచోటు

ఆ ప్రపంచం కావాలని, ఆ మార్పు మనలో రావాలని, ఆ అధునాతన ప్రపంచ నిర్మాణం కోసం జాతి యావత్తూ సమాయత్తం కావాలని మహాకవి జాషువా ఈ కావ్యంలో చక్కని సందేశ మిచ్చాడు. ఇన్ని మేలిగుణాలకు తావల మగుటచేతనే ఆంధ్రదేశం 'గబ్బిలము' కావ్యాన్నాదరించింది. మరుగుపడిన జాషువా కవి జీవితానికి మణి దీపా లెత్తింది. ఈ కావ్యంలోని ప్రతి విషయమూ నవ్యాతి నవ్యంగా దర్శనమిచ్చి మనల్ని అలరిస్తుంది. సమకాలీన సమస్యను వస్తువుగా గైకొని రసరమ్యమైన శైలితో జాషువా కావ్య సృష్టిచేయడం చేత ఇటీవలి మహాకావ్యాల వరుసలో గబ్బిలము చేరింది. మంచి కావ్యంగా నిలిచింది. ముందు నిలుస్తుంది జాషువా రచించిన అనేక ఖండ కావ్యలూ సందేశాత్మకమైనవే. ఆయన సంఘ సంస్కరణ దృష్టితోనే సాహితీ వ్యాసంగాన్ని కొనసాగించాడు. గజారోహణాది సత్కార్యాలను పొందినా విశ్వ విద్యాలయాలచే గౌరవించ బడినా, వివిధ బిరుదములందుకున్నా ఆయన నిగర్విగా, సామాన్యుడిగా జీవయాత్ర సాగించాడు "నివసించుటకు చిన్ని నిలయ మొక్కటిదక్క గడన సేయుట కానసపడనునేను." అని చెప్పుకున్న తెలుగువాడు. ఆయన 'ఆంధ్రుడను,' అనే కవితలోని పద్యం.

(తరువాయి 19వ పేజీలో)

సీరియల్ వ్యాసం

# సంక్షిప్త తెలుగు సాహిత్య చరిత్ర

శ్రీ కె. ఆర్. కె. మోహన్

## 4

మర్నాడు రాత్రి అందరూ తిరిగి, భోజనాలు అయ్యాక హాలులో సమావేశమయ్యారు.

ప్రసాదం మామయ్య తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు. ఇది తొమ్మిదివందల సంవత్సరాలనాటి మాట. ఆనాడు కృష్ణా, గోదావరీ నదుల మధ్యప్రదేశాన్ని వేంగీదేశమని పిలిచేవారు. దీనిని చాళుక్యులు పాలించేవారు. వారిలో ముఖ్యుడు రాజరాజనరేంద్రుడు అనే మహారాజు. ఇతడు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని, రాజ్యమేలుతుండే వాడు. ఇతనికి సాహిత్యాభిలాష మెండుగా ఉండేది. అందువల్ల తన ఆస్థానంలో అనేక మంది పండితులనూ, మహాకవులనూ, పోషించేవాడు. అంతకు ముందు దేశంలోని ఏ ప్రాంతానికి చెందిన కవియైనా, సాధారణంగా సంస్కృతంలోనే వ్రాసేవాడు. సంస్కృతంలో వ్రాసిన వారికే ఎక్కువ గౌరవం ఉండేది. అయితే క్రి. శ. 7, 8 శతాబ్దాల తర్వాత ఈ పరిస్థితి, కన్నడ, తమిళ ప్రాంతాలలో మారుతూ వచ్చింది. ఆ ప్రాంతాలలో, ఆయాభాషలలో కావ్యాలు వెలువడడం మొదలు పెట్టాయి. వాటికి ప్రజల, ప్రభువుల ఆదరణకూడా లభించసాగింది. ఇవన్నీ గమనించిన రాజరాజనరేంద్రునికి కూడా తెలుగులో కావ్యాలని రచింప జేయాలని కోరిక కలిగింది. కావ్యాలలో భారతాన్ని మించినదేమి ఉంది! అందుకే భారతాన్ని తెలుగులో వ్రాయించదలిచాడు. పండితులలో పరమోత్కృష్టుడు నన్నయభట్టు. అందుకే ఆయనకి ఈ బాధ్యతని అప్పజెప్పాడు. అయితే భారతంవంటి మహాకావ్యాన్ని తెలుగులో నేను సరిగ్గా అనువదించగలనా అని, నన్నయవంటి మహాకవికే అనుమానం వచ్చింది. అంటే భారతం ఎంత గొప్పదో తెలుసుకోవచ్చు. ఏమైతేనేమి, భారతాన్ని, మక్కికి మక్కి అనువాదంగాకాక, సంస్కృతమూలాన్ని అనుసరిస్తూ, తెలుగువారి అభిరుచులకి సరిపోయేటట్లుగా, అత్యద్భుతంగా మన తియ్యని తెనుగు భాషలో వ్రాశాడు. ఈ భారత రచనలో ఆయన తన స్నేహితుడు నారాయణభట్టు సహాయం తీసుకున్నాడు."

" మామయ్యా...ఆంధ్రభారతాన్ని కవిత్రయము వ్రాశారని మా పాఠంలో వచ్చింది, మరి నువ్వు నన్నయగారు వ్రాశారని అంటున్నావు. ఏది రైటు?" అని అడిగాడు రవి.

"ఓరి మీ ఇల్లు బంగారంగానూ......... ఉండండ్రా నన్నుపూర్తిగా చెప్పనీయండి. భారతాన్ని ముగ్గురు వ్రాసిన మాట నిజమే. నన్నయగారు ఆది, సభాపర్వాలు, అరణ్యపర్వములో శరత్కాల వర్ణనము మాత్రమే వ్రాశారు. తర్వాత 12వ శతాబ్దపు చివరిభాగంలో కవిబ్రహ్మ తిక్కన సోమయాజి, విరాట పర్వంనుంచి స్వర్గారోహణ పర్వం వరకు గల పదునైదు పర్వాలు రచించారు. తర్వాత తర్వాతి శతాబ్దంలో ఎఱ్ఱాప్రగడ, నన్నయగారు అసంపూర్ణముగా వదిలి పెట్టిన అరణ్యపర్వంలో మిగిలి పోయిన భాగాన్ని పూర్తి చేశారు. వీరిద్దరినీ గురించి ముందు ముందు వివరంగా చెప్తాను. ఇదర్రా సంగతి.. త్రిమూర్తులవంటి ఈ ముగ్గురు కవి వర్యుల చేతిమీదుగా భారత రచన పూర్తి అయింది."

" భారతాన్ని ముగ్గురు రచిస్తే, మరి భారతం అనగానే నన్నయగారినే చేప్తారేం?" అని అడిగింది మాధవి.

" బాగా అడిగావు. భారతాన్ని ఆంధ్రీకరించ మొదలు పెట్టింది నన్నయగారు. ఆయన ప్రారంభించిన కృషినే మిగిలిన వారు కొనసాగించారు. అదీ గాక తెలుగులో ఆదికావ్యాన్ని రచించిన ఘనతకూడా ఆయనదేనాయె. అందువల్లనే భారత రచన అనగానే నన్నయగారి పేరు చెప్పడం జరుగుతోంది" అని విశదీకరించి ప్రసాదం మామయ్య తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

" భారతం వంటి మహాకావ్యం తెలుగులోకి అనువాదం కావడంతో, తెలుగు తల్లికి గొప్ప లాభం కలిగింది. నన్నయగారి వంటి మహావిద్వాంసుడు, భారతంవంటి పవిత్ర కావ్యాన్ని తెలుగులోకి అనువదించడంలో, ఆ తర్వాత కవుల ఆలోచనా ధోరణిలో మార్పు వచ్చింది. వారు ధైర్యంగా అనేక సంస్కృత గ్రంథాలను తెలుగు చేయసాగారు.

" నన్నయ గారికి సమకాలికుడు పావులూరి మల్లన అనే కవి 'సారసంగ్రహగణితం' అనే సంస్కృత గ్రంథాన్ని తెలుగులోకి అనువదించాడు. దీనిని సంస్కృతంలో మహావీరా చార్యులు అనే

్రైనగురువు రచించాడు. అయితే మల్లన వీరశైవుడు. అందువల్ల జైన మతమంటే ఇతనికి సరిపడదు. అందువలన ఈతడు తన గ్రంథంలో జైన భావాలను తీసివేసి, శైవ భావాలను జొప్పించాడు. మల్లన ఎంతో అందమైన పిట్టకథలను, ఆ నాటి ఆచారములను లెక్కల రూపంలో అద్భుతంగా రచించాడు. అటువంటివి ఒకటి రెండు మచ్చుకు చెప్తాను.

" అనగనగా ఒక రాజుగారు ఉండేవారట. ఆయనకి చదరంగపు ఆట అంటే మహా ఇష్టమట. ఒక సారి ఒకమేటి ఆటగాడు ఆయన వద్దకు వచ్చాడట. రాజుగారితో ఆట ఆడుతానన్నాడట. ఆటగాడు ఓడిపోతే తల తీయిస్తాననీ, తాను ఓడిపోతే, ఆటగాడు ఏది అడిగినా ఇస్తాననీ రాజుగారు షరతు పెట్టారట. ఆటగాడు సరేనని ఒప్పుకున్నాడట.

ఆట బ్రహాండంగా సాగింది. చివరకి రాజుగారు ఓడిపోనే పోయాడు. మాటప్రకారం ఆటగాణ్ణి ఏమికావాలో కోరుకోమన్నారు. ఆటగాడు "స్వామీ, నాకు వడ్లగింజలు ఇప్పించండి. ఇది చదరంగపు ఆటకి సంబంధించిన పందెం కనుక, నాకు ఎన్ని వడ్లగింజలు కావాలో ఆ రూపంలో చెబుతాను.' అంటూ ఈ విధంగా కోరాడుట.

"మొదలొకటనిల్పి దానిం
గదియగ దుదిదాక రెట్టిగా గూడినచో
విదితముగ బల్కుమానం
జదరంగపు టిండ్లకైన సంకలితమొగిన్

అంటేమొదటి గడిలో ఒకటి, రెండవ గడిలో రెండు, మూడవదానిలో నాలుగు, నాలుగవ దానిలో ఎనిమిది ఈవిధంగా రెట్టించుకుంటూ పోతూ మొత్తం 64 గళ్ళనూ ఎన్ని గింజలు వస్తాయో అన్ని ఇమ్మన్నాడట.

"ఈవెర్రిబ్రాహ్మడు ఇంత చిన్న కోరిక కోరాడేమిటి? అని నవ్వుకొని మంత్రిగారిని పిలిచి మొత్తం ఎన్ని వడ్లవుతాయో లెక్కవేసి ఇమ్మన్నాడట రాజుగారు మంత్రిగారు లెక్కవేసి గుండెలు బాదుకొని తల పట్టుకున్నాడట. అదేమని రాజుగారు అడిగితే " స్వామీ మన రాజ్యంలోని పంట కాదుగదా, మొత్తం ప్రపంచంలో పండే వడ్లన్నీ వంద సంవత్సరాలు సేకరించినా ఈయన అడిగిన దానికి సరిపోవు మొత్తం 64 గళ్ళకూ 18446744073709551615 గింజలు కావలసి వస్తాయి" అని చెప్పాడట.

అదివిని రాజుగారు బ్రాహ్మణుని గణిత పాండిత్యానికి మెచ్చుకొని స్వామీ, నేను అశక్తుడిని రక్షించండి అంటూ ఆయన పాదాలపై పడ్డాడట.

పై కథలోని సమాధానాన్ని మల్లన ఎంత అందంగా పద్య రూపంలో చూపించాడో చూడండి.

'శరశశి షట్క చంద్ర శరసాయకరంధ్ర వియన్నగాగ్ని భూ
ధర గగనాబ్ధి వేదగిరి తర్కపయోనిధి పద్మజాస్యకుం
జర తుహినాంశు సంఖ్యకు విజంబగు తచ్చతురంగ గేహవి
స్తరమగు రెట్టి రెట్టికగు సంకలితంబు జగత్ప్రసిద్ధికిన్.'

మన ప్రాచీన భారతీయ పద్ధతిలో ప్రతి అంకెకూ కొన్ని గుర్తులు ఉండేవి. 'శర' అంటే ఐదు (మన్మథుని బాణాలు ఐదు కనుక). 'శశి' అంటే ఒకటి– ఆకాశంలో చంద్రుడు ఒక్కడే కనుక, షట్కం అంటే ఆరు. ఇల్లాంటి గుర్తులని ఆధారం చేసుకొనిపోతే జవాబు 18446744073709551615 అని వస్తుంది. అంకెలను కుడినుంచి ఎడమకు వేసుకు రావాలి.

ఇంకొక తమాషా పద్యం చూడండి.

అరు నొక్కట్ల నొడ్డుగా నమరబెట్టి
యంత గుణకంబు చేతను నమర బెంచి
సొరిది వర్ణించి జనులకు జోద్యముగను
హిమకరోపమ లబ్ధంబు నెనయ వచ్చు."

దీని అర్థం–1, 11, 111 అనే అంకెను అదే 1, 11, 111తో గుణిస్తే 12345654321 వస్తుంది అని.

"నువ్వు చెప్పిన చదరంగం గళ్ళకథ నేను ఇంకదేంట్లోనో చదివాను" అన్నాడు భాస్కరరావు.

"ఒక దాంట్లోనేమి చాలావాటిలో ఉంది. అయితే అతనికి సంబంధించిన ప్రశ్నజవాబులు పద్య రూపంలో మల్లన వ్రాశాడు. కనుక ఆ కథను ఈ సందర్భంలో తిరిగి చెప్పాను అంతే" అన్నాడు ప్రసాదం మామయ్య.

ఇంక నన్నయగారి కాలానికే చెందిన మరొక మహాకవి నన్నె చోడుని గురించి తెలుసుకుందాం– ఈతని పూర్తి పేరు నన్నె చోడ వేంకటాదిత్యుడు. ఇతడు కావేరీ తీరంలో ఒరయూరును రాజధానిగా చేసుకొని రాజ్యమేలిన ప్రభువు ఈతడు ప్రథమ క్షత్రియ కవి. ఇతని కాలం గురించి అనేక మంది పండితులు అనేక విధాలుగా ఊహించారు. కొందరు నన్నయకి ముందు అన్నారు. మరికొందరు ఆ తర్వాత వాడన్నారు, ఇంకొందరు సమకాలీను డన్నారు. చాలా మంది అభిప్రాయం ప్రకారం ఈతడు నన్నయ తిక్కనల మధ్య కాలానికి అంటే క్రీ. శ. 11–12 శతాబ్దాలకు చెందినవాడని. ఈతడు ఆంధ్ర కుమార సంభవమనే గొప్ప గ్రంథాన్ని రచించాడు ఇందులో భాషచాలా సులువుగా అందరికీ అర్థమయ్యేటట్లు ఉంటుంది. ఇతడు మొదటి సారిగా తన 'గ్రంథంలోని' ఇష్టదేవతా ప్రార్థన పూర్వకవిస్తుతి అంటేతన ముందున్న కవులను గుర్తు చేసుకొనడం 'కుకవినింద' అంటే చెడుకవులను తిట్టడం, గ్రంథకర్త స్వవిషయం కృతి పతివర్ణన అంటే తన పుస్తకాన్ని ఎవరికి అంకితం చేశాడో వారిని గురించిన వర్ణన, మొదలైన కొత్తపద్ధతులను ప్రవేశ పెట్టాడు ఈతని పద్ధతిలోనే ఆతర్వాతి కవులు ఇంచుమించు అందరు అనుసరిస్తూవచ్చారు. అందువల్లే నన్నయ వలె ఇతడు కూడా చాలా విషయాలలోని ఆదికవి అని చెప్పవచ్చు"

"నన్నె చోడుడు తియ్యని తెనుగులోని సులువైన భాషలో వ్రాశాడని చెప్పావు. మచ్చుకి ఒక్క పద్యం చదువు బావా "అని అడిగాడు భాస్కరరావు.

అలాగే కుమార సంభవ కథలో మన్మధుడు శివుడిపై బాణాలు వేసిన విషయం తెలుసుగదా. దాంతో శివునికి కోపం వచ్చి మూడవ కన్ను తెరిచాడు. వెంటనే మన్మధుడు బూడిద అయి పోయాడు. ఆ ఘట్టంలోని ఎవరెవరి మనస్సు ఎల్లా ఉందో, ఎంత చక్కగా చెప్పాడో చూడండి.

"గిరిసుతమై గామాగ్నియు
హరుమై రోషాగ్నియుం దదంగజుమై ను
ద్ధర కాలాగ్నియు రతిపై
నురు శోకాగ్నియును దగిలియొక్కట నెగసెన్".

పార్వతికి శివునిపై కోర్కె అగ్నిట. శివునికి కోపం అగ్ని వలె ఉందిట. మన్మథునికి కాలంతీరి పోయి అగ్నికి ఆహుతి అయి పోయినదట. అతని భార్య రతీదేవి శోకం అనే అగ్నిలో బాధ పడి పోయిందట.

"ఎంత బాగా చెప్పాడురా" అంది రమణమ్మ, గడ్డం క్రింద చేయివేసుకుని.

"ఇంక మన తెలుగు దేశంలో ఆబాలగోపాలానికీ తెలిసిన వేములవాడ భీమకవి గురించి తెలుసుకుందాం. ఇతడు గోదావరీ మండలంవాడు. దాక్షారామ భీమేశ్వరస్వామి నందనుడనని తనే చెప్పుకున్నాడు. ఇతని కాలంకూడా సరిగ్గా తెలియదు. కాని నన్నయకు కొంచెం తర్వాతివాడని—అంటే 11వ శతాబ్ది చివరవాడని పండితుల అభిప్రాయం."

"అదేమిటి మామయ్యా, మనిషికి భగవంతుడు తండ్రి ఏమిటి?" అని అడిగింది విమల అడ్డువస్తూ.

"అదేమో తెలియదుకాని ఇతని జన్మని గురించి ఒక చిత్రమైన కథ ఉంది. ఈతని తల్లి బాలవితంతువట. అంటే ఆమె చిన్నతనం లోనే భర్త చనిపోయాడట. ఈమె ఒకసారి యాత్రికులతో కలసి ద్రాక్షారామ వెళ్ళిందట. ఆ గుడిలో కప్పస్తంభం అని ఒకటి ఉంది. పిల్లలు లేని స్త్రీలు ఆ స్తంభాన్ని కౌగలించుకుంటే పిల్లలు పుడ్తారని ప్రజల నమ్మకం. ఈమె బాలవితంతువు-పిల్లలు పుట్టకముందే భర్త చనిపోయాడు. అక్కడ కొందరు స్త్రీలు పిల్లల కోసం ఆ స్తంభాన్ని కౌగలించుకుంటూవుంటే, ఈమెకూడ సరదాగా ఆ స్తంభాన్ని కౌగలించుకుందిట. ఆమె అమాయకంగా ఆ పని చేసినా, భీమేశ్వరస్వామి ఈమెకి భర్త లేనందువల్ల తన అంశతో కొడుకు పుట్టేటట్లుచేశాడుట. అందుకే ఆమె తన పుత్రునికి భీమన్న అని పేరు పెట్టుకుంది. అయితే భర్త లేని స్త్రీకి పుట్టిన పిల్లవాడు అవడంతో, భీమన్నని ఎవరూ దగ్గరకు రానిచ్చేవారుకాదుట. ఒక సారి ఒకచోట పెద్ద సంతర్పణ జరుగుతోందట. అందరూ భోజనములు చేస్తుండగా బాలుడైన భీమనకూడా భోజనానికి వెళ్ళాడుట. అయితే అక్కడివారు అతనిని విధవా పుత్రుడనే కారణంగా రానీయలేదుట. దాంతో భీమనకి కోపంవచ్చి 'అప్పాలన్నీ కప్పలు కావాలి. అన్నం అంతా సున్నం కావాలి' అని తిట్టాడుట. వెంటనే అందరివి విస్తళ్ళలోని అన్నం సున్నంగానూ, అప్పాలు కప్పలుగానూ మారిపోయాయిట. వెంటనే వారు తమ తప్పులు క్షమించమని భీమనని వేడుకున్నారుట. అప్పుడు అతడు శాంతించి తిరిగి వాటిని అన్నంగానూ, అప్పాలుగానూ మర్చాడుట. అప్పటినుంచీ ప్రజలు అతనినీ, అతని తల్లినీ గౌరవించసాగారుట."

"ఈ భీమన ఏమి పుస్తకాలు వ్రాశాడు మామయ్యా?" అని అడిగింది మాధవి.

"రాఘవ పాండవీయం, శతకంఠ రామాయణం, నృసింహ పురాణం మొదలైనవి వ్రాశాడంటారు. అయితే దురదృష్టవశాత్తూ ఈతనిగ్రంథాలలో ఏ ఒక్కటీమనకి దొరకలేదు. 'కవిజనాశ్రయం' అనే లక్షణగ్రంథాన్ని ఇతడు వ్రాశాడనికొందరంటే కాదని మరికొంద రంటారు. అయితే ఇతని చాటువులు కొన్ని మనకు దొరికాయి. అవే అతని కింత కీర్తిని తెచ్చి పెట్టాయి. అంతేగాక ఇతనికి వున్న వాక్శుద్ధిని గురించీ, అసామాన్య శక్తులు గురించీ, అనేక కథ లున్నాయి".

"అవును ఎవరో రాజును తిట్టి రాజ్యం పోగొట్టాడనీ తిరిగి దీవించి రాజ్యం ఇచ్చాడనీ విన్నాను." అన్నాడు భాస్కరరావు.

"అవును. ఆ కథ వినడానికి చాలా బాగుంటుంది. చెప్తాను వినండి. ప్రస్తుతం మధ్యప్రదేశ్‌లో మన్న బస్తర్, ఒరిస్సా లోని కోరాపుట్ ప్రాంతాలు ఆనాడు తెలుగు ప్రాంతంగా ఉండేవి. ఆ ప్రాంతాన్ని 'త్రికళింగం' అని పిలిచేవారు. దీనికి చక్రకూటం రాజధాని. ఆ రాజ్యాన్ని చోడగంగు అనే రాజు పాలిస్తున్న రోజుల్లో భీమకవి అతని దర్శనానికి వెళ్ళి తన రాకను ఈ విధంగా ప్రతీహారిద్వారా కబురు పంపించాడుట.

శాపానుగ్రహ పటువును
రాపాడెడి కవుల నెత్తి రంపంబనగా
భూపాల సభల బూజ్యుడ
నాపేరే భీమనండ్రు నరవర! వినుమా!

అని అంటే "తలుచుకుంటే శాపం ఇయ్యగలను. లేదా అనుగ్రహం చూపగలను. కవుల నెత్తిన రంపంలాంటివాడిని అనగా వారందరి కన్నా గొప్పవాడిని, రాజుల సభల్లో పూజింపబడేవాడిని. నా పేరే భీమన"—అని.

ఇది చూడగానే కళింగగంగుకి భీమన వట్టి గర్విష్టిగా కనిపించాడు. కోపంవచ్చి 'ఇప్పుడు చూడడానికి వీలులేదు. తర్వాత రమ్మను' అని జవాబు పంపించాడు.

దానితో భీమనకి ఒళ్ళుమండింది. తన శాపం ఎంతగొప్పదో చూపించాలనుకున్నాడు. వెంటనే ఈ విధంగా పద్యంలో శాపం పెట్టాడు.

వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామమునాని కోపమున సందడిదీరిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిక ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల జేరుగావుతన్

అని. అంటే 'వేములవాడ భీమకవిని కళింగగంగు శాంతము విడిచి కోపముతో, ఇప్పుడు పో తిరిగ్గా రా—అని అన్నాడు. వీని ముఖం చూసిన పాపం, ఇంక ముప్పదిరెండు రోజుల తర్వాత ఇతని సంపద శత్రువుల పాలవుగాక అని.

భీమకవి శపించినట్లుగానే, కులోత్తుంగచోళుని సామంత రాజు, ఇమ్మడి పోతరాజు దండెత్తివచ్చి త్రికళింగాన్ని జయించాడు. కళింగగంగు దేశంవిడిచి పారిపోయాడు.

తర్వాత కొంత కాలానికి కళింగగంగు ఒక నాటి రాత్రి చీకటిలో ఎక్కడికో వెళ్తూ కాలుజారి గోతిలో పడ్డాడుట. 'అంత బ్రతుకూ బ్రతికినమహారాజుకి ఇప్పుడు దివిటీ అయినా లేకపోయిందే' అని బిగ్గరగా దుఃఖించాడట. ఆదేనమయానికి భీమకవి అటు వెళ్తూ 'ఎవరు నువ్వు'? అని అడిగాడుట. 'నేను భీమకవి చేసిన జోగిని' అని గంగు ఏడ్చాడుట.

"నామాట ఊరికే పోతుందా ?" అని సగర్వంగా భీమకవి ఈ పద్యం చెప్పాడుట.

> రామునమోఘ బాణమును, రాజశిఖామణి కంటిమంటయున్
> దామరచూలి వ్రాతయును, దారక విద్విషఘోర శక్తియున్,
> భీము గదా విజృంభణ, ముపేంద్రుని చక్రము వజ్రివజ్రమున్
> వేములవాడ భీమకవివీరుని తిట్టును రిత్తవోవునే ?

అని. అంటే 'రామబాణము, ధర్మరాజు కోపము, బ్రహ్మవ్రాత, శివునిశక్తి, భీముని గద, విష్ణుచక్రము, ఇంద్రుని వజ్రాయుధము, వేములవాడ భీమకవి తిట్టు ఊరకేపోతాయా? ' అని.

ఈ పద్యం విని కళింగగంగు భీమకవిని గుర్తించి క్షమించమంటూ ఆయన కాళ్ళమీద పడ్డాడుట. అప్పుడు భీమకవి కరుణించి ఈ పద్యం చెప్పాడుట.

> వేయిగజంబులుండ పదివేల తురంగములుండ నాజిలో
> రాయల గెల్చి సజ్జనగరంబున బట్టము కట్టుకోవడిన్
> రాయ కళింగగంగ! కవిరాజు భయంకరమూర్తి తిట్టు దా
> బోయిన మీన మాసమున బున్నమపోయిన షష్టినాటికిన్

అంటే వచ్చే.ఫాల్గుణమాస బహుళ షష్టినాటికి నా శాపం నీకు తీరుతుంది. నీవు వెయ్యి ఏనుగులు, పదివేల గుర్రాలు గల బలమైన సైన్యంతో యుద్ధంచేసి శత్రువును గెలిచి సజ్జనగరంలో తిరిగి పట్టాభిషేకం చేసుకుంటావు అని.

ఆ ప్రకారంగానే కళింగగంగు తిరిగి రాజ్యాన్ని పొందాడుట. సజ్జనగరం గోదావరి మండలంలో పిఠాపురం దగ్గర్లో ఉండేదని పండితుల అభిప్రాయం."

"భీమకవి పేరిటనున్న చాటువులు చాలా ప్రసిద్ధమైనవని చెప్పావుకదా. మచ్చుకి ఒకటి వినిపించు బావా" అని అడిగాడు భాస్కరరావు.

---

## జాషువా--గబ్బిలం

( 15 వ పేజీ నుండి )

బహుదేశములను బేర్వడసి మీసము దీటు
భరత ఖండంబు నా పాఠశాల
స్తన యుగంబున గాన సాహిత్యములు గల్గు
భాషా వధూటి నా పంతులమ్మ
సాందీపని సమక్షమందు విద్యగడించు
వనమాలి నా సహపాఠకుండు
భక్తి వైరాగ్యసంపదల తావలమైన
భాగవతంబు నా బాలశిక్ష
గంటము ధరించి మోహనాక్షరములెనయ
ప్రతి ఫలించెదు నా మహోన్నత విభూతి
వ్రాసి కొందును దశ దిశాఫలక పంక్తి
గడన కెక్కిన యాంధ్ర పుత్రుడను నేను

పై పద్యం లోపల జాషువా మూర్తిమత్వం మనకు దర్శనమిస్తుంది. ఆయన కవిత్వంలో జాతీయ తత్వం, సంస్కరణవాదం, అభ్యుదయ భావం మూడూ త్రివేణీ సంగమంలా కలసిపోయాయి. ఆ మహాకవి కావ్యాలు మణి దీపాలలా తెలుగు దేశంలో కలకాలం వెలుగుతూనే ఉంటాయి. ఆయన కావ్యపారిజాతాలు యోజనాల పర్యంతం అనంత కాలాలూ పరిమళాలను పంచి పెడుతూనే ఉంటాయి. ఆయన ఆంధ్రులకు ఆదర్శ ప్రాయుడైన మహాకవి.

# నవ పథంలో నడుస్తున్న నందమూరు

శ్రీ సిద్దాని నాగభూషణం.

పశ్చిమగోదావరి జిల్లా జిల్లా పంచాయతీ ఆఫీసరు శ్రీ ఎస్ సీతారామారావును నేను ఆ మధ్య కలిసినప్పుడు తాడేపల్లి గూడెం తాలూకాలో ఉత్తమంగా పనిజేసే పంచాయతీలు ఉన్నయా? అని అడిగాను లేకేమండి నల్లజర్ల సమితికి చెందిన నందమూరు ఉత్తమంగా పనిజేసే పంచాయతీలలో ఒకటి అని అన్నారు జిల్లా పంచాయతీ ఆఫీసరు.

''అలాగండీ. ఏ విధంగా నందమూరు పనిజేస్తున్నదో వివరించండి?

''తప్పకుండా'' అని అంటూ, తిరిగి యీలా అన్నారు.

"చూడండీ నందమూరు నల్లజర్లకు 32 కిలోమీటర్ల దూరంలో విడదవోలుకు ఏడు కిలోమీటర్ల దూరంలో 1409 మంది జనాభా గలిగిన చిన్నగ్రామం ఒకనాడిది నూజివీడు జమిందారీలో గ్రామం ఈ గ్రామ విస్తీర్ణం 715 59 ఎకరాలు బంజరు భూము లేమీ లేవు కాలువలు, బోదెలు. పుంతలు 174 25 ఎకరాలు. సాగుభూమి 534 35 ఎకరాలు మాత్రమే. ఈ పొలాలు సాగునీటి ఆధారం గోదావరి కాలువలు "



నందమూరు సర్పంచ్ శ్రీ దేవులపల్లి రామారావు



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నందమూరులో వెటర్నరీ హాస్పిటల్‌కు ప్రారంభోత్సవం చేసారు కలెక్టర్ శ్రీ జి కుమార స్వామిరెడ్డి. శ్రీ అల్లూరి బాపినీడు ప్రభృతులు యీ కార్యక్రమానికి హాజరయ్యారు.

"వివరాలు వింటుంటే చాలాచిన్న గ్రామమే నందమూరు. అయితే ఆర్థిక వనరులు ఏవిధంగా సమకూర్చుకొందో వివరించండి అని అన్నప్పుడు శ్రీ సీతారామారావుగారు సాధించిన ప్రగతిని వివరించారు పంచాయతీ ఏర్పడినాటినుంచి ఏకగ్రీవ ఎన్నికలు. గ్రామంలో సమైక్యత, గ్రామ వికాసానికి నిరంతర నిర్విరామకృషి ఈ గ్రామ ప్రగతికి బాటవేశాయి. 1937 అక్టోబరు 31 వ తేదిన ఏర్పాటు చేయబడిన నందమూరు గ్రామ పంచాయతీకి అప్పటినుంచి 1950 సంవత్సరం వరకు శ్రీ దేవులపల్లి వెంకట్రావుగారు నాయకత్వం వహించారు. 1950 సంవత్సరం నుంచి శ్రీ దేవులపల్లి రామారావు నాయకత్వం వహించి నందమూరును నందనవనంగా చేయటానికి అనవరం కృషిచేస్తున్నారు "

గ్రామ పంచాయతీ సాధించిన అభివృద్ధికిని వివరిస్తూ ఇలా అన్నారు "పరిమితమైన నిధులు కారణంగా మొదటో నందమూరు గ్రామ పంచాయతీ ఊళ్ళో రహదారులు ఏర్పాటు చేయటానికి కృషి చేస్తూ వచ్చింది 1957 సంవత్సరంలో సర్పంచ్ శ్రీరామారావు భగీరథ ప్రయత్నంచేసి, గ్రామానికి విద్యుచ్ఛక్తి తీసుకొని రావడమే

గాక పంచాయతీ వీధులలో 38 విద్యుద్దీపాలను వేయటం జరిగింది. పంచాయతీ రాజ్యం 1959 సంవత్సరంలో వచ్చింది పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు ఆర్థిక సహాయం చేస్తూవచ్చింది. అప్పట్లో అంటే 1960 సంవత్సరంలో పెంటపాడు సమితి నుంచి 5000 రూపాయలు ఆర్థిక సహాయం పొంది, 13,600 రూపాయల ఖర్చుతో పరిరక్షిత మంచినీటి పథకాన్ని నందమూరు పంచాయతీ అమలు పరచింది. గ్రామంలో 4 చోట్ల పైపులకు అమర్చి ప్రజలకు పరిరక్షిత మంచినీటిని అందజేస్తున్నది ఈపథకం అమలుకు గ్రామ పంచాయతీ తన నిధులనుంచి 8600 రూపాయిలు ఖర్చుచేసింది.

## ప్రాథమిక పాఠశాలలకు శాశ్వత భవనాలు

నందమూరులో విద్యా సౌకర్యం కోసం గ్రామ పంచాయతీ చేసిన కృషిని వివరిస్తూ, జిల్లా పంచాయతీ ఆఫీసరుగారిలా అన్నారు. "ఈ గ్రామంలో రెండు ప్రాథమిక పాఠశాలలు ఉన్నాయి. పంచాయతీ సర్పంచ్ శ్రీ దేవులపల్లి రామారావుగారు శ్రద్ధ తీసుకొని, 1961 సంవత్సరంలో గ్రామంలో ఉన్న పాఠశాలకు 12,400 రూపాయల ఖర్చుతో నిర్మింప జేయించారు ఈ పాఠశాల భవన నిర్మాణానికి గ్రామ ప్రజలు 4134 రూపాయలు అందజేస్తే, గ్రామ



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రారంభించిన ప్రాథమిక పాఠశాల భవనం

పంచాయతీ 2066 రూపాయలు విరాళం ఇచ్చింది పెంటపాడు సమితి 6200 రూపాయలు ఇచ్చింది ఈ పాఠశాలకు అప్పటి పెనుమూరు నియోజక వర్గ శాసన సభ్యులు ప్రస్తుతం ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు 1962 ఆగష్టు 10వ తేదీన ప్రారంభోత్సవం చేశారు రెండవది హరిజన వాడలో నిర్మించబడింది."

పశ్చిమ గోదావరి జిల్లా పశుసంవర్ధన శాఖ అధికారి శ్రీ. వింజమూరి కమలాకర రావుగారు నందమూరు గ్రామంలో అమలు పరచిన పశుసంవర్ధక కార్యక్రమాల గురించి వివరించమని కోరినప్పుడు వారిలా అన్నారు" గ్రామంలో రైతాంగం ఎక్కువ పాడిని అభివృద్ధి చేసుకోవాలని రైతులు నిశ్చయించుకొన్నారు. గ్రామీణ పశువైద్యశాలను ప్రారంభించుకొన్నారు ఈ ప్రాథమిక పశువైద్య కేంద్రానికి ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్ గారు ప్రారంభోత్సవం చేశారు. ఈ కేంద్రం ప్రాముఖ్యాన్ని ప్రయోజనాన్ని ప్రజలు గుర్తించారు శాశ్వతంగా గ్రామంలో పశు వైద్యశాలను నెలకొల్పు కోనాలని ప్రజలు అప్పట్లో అంటే 1970 సంవత్సరంలో ప్రభుత్వం మీ ఆసుపత్రిని మీరే నెలకొల్పుకొనండి అనే పథకం అమలు పరుస్తానంది ప్రభుత్వం ఈ పథకం క్రింద ప్రజలు ఆస్పత్రికి ఉచితంగా వసతి ఏర్పాటు చేయవలసి ఉంటుంది ఆవిధంగానే నందమూరు గ్రామప్రజలు ఏర్పాటుచేశారు ఒక పశువుల డాక్టర్, ఒక కంపౌండరుతో ఆసుపత్రి ప్రారంభించబడింది.

ఈ ఆసుపత్రి నవాబుపాలెం, మారంపల్లి ఆరుళ్ళ, నందమూరు గ్రామాలకు ఉపయోగపడుతుంది. పశువుల ఆసుపత్రి భవననిర్మాణానికి ఒకకమిటీ ఏర్పాటు చేయబడింది గత మూడేళ్ళలో 4500 రూపాయలు విలువగల మందులను, 5000 రూపాయల విలువ గల పరికరాలు అందజేయుట జరిగింది భవన నిర్మాణానికి గ్రామ ప్రజలు మూడువేల రూపాయలు విలువగల స్థలాన్ని దానం చేశారు. 40,111 రూపాయల ఖర్చుతో పశువుల ఆసుపత్రి భవనం నిర్మించబడింది ఈ భవన నిర్మాణానికి ప్రజలు 13, 860 రూపాయలు విరాళం ఇస్తే, నల్లజర్ల సమితి 7930 రూపాయలు, గ్రామ పంచాయతీ 2950 రూపాయలు విరాళం ఇవ్వడమయింది. జిల్లా కలెక్టరు జిల్లా సంక్షేమ నిధి నుంచి 15370 రూపాయలు విరాళం అందజేశారు. ఈ భవనానికి 1974 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు ప్రారంభోత్సవం చేశారు. ఈ పశువుల కేంద్రం 1925 పశువులకు, 100 గొర్రెలు మేకలను 2457 కోళ్ళకు చికిత్సకై ఉద్దేశింపబడింది.

ఆసుపత్రి భవన నిర్మాణంతోనే ప్రజలు సరిపుచ్చుకొన్నారా? పశువుల కేంద్రాన్ని వినియోగించు కుంటున్నారా? ఉపయోగించుకోక పోవడమే లేదు—1974–75 సంవత్సరంలో ఈ ఆసుపత్రిలో 5440 పశువులకు చికిత్స జరిగింది. 151 పశువులకు కృత్రిమ గర్భధారణలు జరిగాయి. కొత్త రకం పశువుల మేతకు 20 సెంట్లలో కొత్తరకం పచ్చగడ్డి పరకలను పెంచటం జరిగింది. 223 కిలోల



జిల్లాపరిషత్ అధ్యక్షుడు శ్రీ అల్లూరి బాపినీడు ప్రారంభించిన పరిరక్షిత మంచినీటి బావి

పశువుల దాణాను కొనిపించటం జరిగింది. రోగాల నిరోధానికి టీకాలు, రోగచికిత్సలు జరిగాయి. రోజూ సరాసరికి 15 పశువులకు 1974–75 సంవత్సరంలో చికిత్స జరిగింది ఈ నాడు ఈ గ్రామంలో 651 మెట్రిక్ టన్నుల పాల ఉత్పత్తి జరిగింది ఇదివరలో పశువు 2.08 లీటర్ల పాలిస్తే, ఈనాడు 3.21 లీటర్ల పాలు ఇస్తున్నది పాల ఉత్పత్తి పెరగటంవల్ల పాల సేకరణ కేంద్రం ప్రారంభించబడింది. రోజు సరాసరి 60 లీటర్లకు తక్కువ కాకుండా 120 లీటర్ల వరకు పాలశీతల కేంద్రానికి అందజేయడం జరుగుతుంది. రైతులు ఆర్థికంగా ప్రయోజనం పొందారు నందమూరులో ఉత్సాహవంతు

న రైతు శ్రీ డి. వెంకటనృసింహ అప్పారావుగారు చెప్పిన దానినిబట్టి రైతులు శాస్త్రీయ పద్ధతులపై సాగుచేయడంవల్ల ఎక్కువ దిగుబడి నిచ్చే రకాల వల్ల కనీసం 5 నుంచి 10 బస్తాలు అదనంగా దిగుబడి వస్తున్నావని తెలిపింది ఎర్రకాలువ ముంపు వల్ల దెబ్బతింటున్న ఈ పొలాలకు ముంపునుంచి విముక్తి పొందాలంటే పోతవరం వద్ద అనుమలంక ప్రాజెక్టు నిర్మాణంకావాలి.

## నందమూరు ప్రత్యేకతలు: తంత్రీ ప్రసార కేంద్రం స్థాపన

నందమూరు గ్రామపంచాయతీ సాధించిన విజయాలు గురించి వివరంగా పశ్చిమగోదావరి జిల్లావరి షత్తు కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు తెలియజేస్తూ, "పశ్చిమ గోదావరి జిల్లాలో ఐదు స్పీకర్లతో తంత్రీ ప్రసార కేంద్రాన్ని wire broad costing) 1966 సంవత్సరంలో ప్రప్రథంగా ఏర్పాటుచేసింది నందమూరు 20,223



మాజీ మంత్రి శ్రీ ఎం ఎన్ లక్ష్మీనరసయ్య వైర్ బోర్డు కాస్టింగు స్కీమును ప్రారంభించినప్పటి దృశ్యం

రూపాయల ఖర్చుతో 2 ఫర్లాంగుల 65 గజాల సిమెంటు రహదారులను నందమూరు వేయడమేగాక రైతుల సౌకర్యం కోసం ఏలూరు కాలువకు రేవును ఏర్పాటుచేసి, 2000 రూ ల ఖర్చుతో మెట్లను వేసింది. నందమూరు పంటకాల్వపై ఏడువేల రూపాయలు ఖర్చుతో పంచాయతీ వంతెన నిర్మిస్తే, నల్లజర్ల సమితి 3500 రూపాయల ఆర్థిక సహాయం చేసిందని అన్నారు

## బలహీన వర్గాల సంక్షేమం

" పంచాయతీ రాజ్యం" ఉన్నతకులాల వారికి, ఉన్నవారికి ఎక్కువగా ఉపయోగ పడుతుందనే విమర్శన ఉంది· పంచాయతీ సాధించిన ప్రగతి వారికి ఉపయోగపడిందా అని అడిగినపుడు శ్రీ వెంకట్రావు గారు సమాధానం చెపుతూ " ఏం పని జేసినా విమర్శన ఉంటూనే ఉంటుంది. వాస్తవానికి చూడండి పంచాయతీరాజ్యం వచ్చిన తర్వాత గ్రామీణ ప్రాంతంలో వేసిన రహదారులు. బావులు. విద్యుచ్ఛక్తి కేవలం ఉన్నవారికే ఉపయోగపడ్డాయా? పేదవారికి ఉపయోగపడటంలేదా? నందమూరు పంచాయతీ విషయమే చూద్దాం. పేదవారికి ఎన్నో సౌకర్యాలు కలుగజేసింది హరిజనవాడలో అయిదున్నర ఫర్లాంగుల రహదారులు వేసింది. 8000 రూపాయలు ఖర్చుచేసి పరిరక్షిత మంచినీటి పథకాన్ని విస్తృత పరచింది. మొదట్లో వెయ్యి రూపాయలు ఖర్చుచేసి మంచినీటి బావిని తవ్వించింది విద్యుచ్ఛక్తి విస్తృత పరిచింది ఆరు హరిజన కుటుంబాలకు 16 200 రూపాయలు ఖర్చుతో జయంతి కాలనీ నిర్మింపజేస్తే ప్రజలు 3000 రూపాయలు విరాళం అందజేశారు హరిజనుల విద్యాసౌకర్యంకోసం జిల్లా కలెక్టర్ శ్రీ జి. కుమారస్వామి రెడ్డిగారు అందజేసిన 6900 రూపాయలు ఖర్చుతో ప్రాథమిక పాఠశాలకు శాశ్వత భవనం ఏర్పాటు చేసిందని అన్నారు.

ప్రజలు ఏర్పాటు చేసుకొన్న గ్రంథాలయం ఈ గ్రామంలో చక్కగా నిర్వహించుతోంది. చేనేత పారిశ్రామికులకు సహకార సంఘంకూడా ఉంది. ఇవన్నీ పేదవారికి ఉపయోగపడేవే అని శ్రీ కళా వెంకట్రావుగారన్నారు.

నందమూరులో ప్రగతి ఒక్కరోజులో, ఒక సంవతర్సంలో సాధించింది కాదు. పంచాయతీ రాజ్యం ఏర్పడిననాటి నుంచి నిరంతరం సాగుతున్న కృషిఫలితమే. 1965 సంవత్సరంలోనే నందమూరు గ్రామపంచాయతీ నల్లజర్ల సమితిలో ఉత్తమ పంచాయతీగా ఎన్నికయి 1000 బహుమతి నందుకుంది· 1964 సంవత్సరంలో ఏకగ్రీవ ఎన్నికలు జరిపించినందుకు 850 రూపాయల



నందమూరు వెటర్నరీ హాస్పిటల్ భవనం

బహుమతిని అందుకొని పంచాయతీరాజ్య కార్యకర్తల ప్రశంసలు నందుకుంది. ఈ నాడిది జయంతి గ్రామం. ప్రచారానికి, ప్రచారకు లకు దూరంగా ఉంటూ, గాంధీజీ ఆశించిన గ్రామరాజ్య స్థాపనకోసం హుందాగా కృషిచేస్తున్న శ్రీ దేవులపల్లి రామారావుగారి వంటి కార్యకర లు ఈ నాడు పంచాయతీరాజ్యానికి ఎంతో అవసరం ప్రగతి పథంలో నడుస్తున్న నందమూరు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి జన్మస్థలం *

# ఆత్యయిక పరిస్థితిపై సామాన్యుని అభిప్రాయాలు

( మా విలేఖరి )

[శ్రీమతి ఇందిరాగాంధీ ఆత్యయిక పరిస్థితిని ప్రకటించి దేశ ప్రజల అభ్యున్నతికోసం 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టారు దానితో ప్రజల్లో నూతన చైతన్యం కలిగింది సామాన్యుని జీవన స్థితిగతులు మెరుగవుతున్నాయి. ఇది ఎంత వరకు నిజం ? మా ప్రతినిధి యింటర్వ్యూ చేసిన కొందరు సామాన్యుల అభిప్రాయం వినండి.—సం.]

ప్రభుత్వ పంచాయతీరాజ్య శాఖలో పనిజేస్తున్న శ్రీ డి ఎన్. ప్రసాదరావుగారు వివరిస్తూ ఆత్యయిక పరిస్థితికిముందు, ప్రకటించిన తర్వాత రాష్ట్ర పరిస్థితిని వివరించారు "ఆత్యయిక పరిస్థితి ప్రకటించకపూర్వం ఏరోజు కారోజు ఏం జరుగుతుందో, ఎక్కడ బస్సులు ఆపివేస్తారో అనే ఆత్రత ఉండేది. ఎక్కడ కొట్లాటలు జరుగుతాయో అనేభయ వాతావరణం తాండవించేది. పిల్లలను బడికి పంపించి ఆఫీసుకు వచ్చేవాళ్ళం కాని పిల్లల మీదే దృష్టి ఉండేది. పిల్లలు బడినుంచి తిరిగొచ్చే వరకుకూడా నా ఆత్రత తగ్గేదికాదు.

ప్రకటించిన తర్వాత బస్సులు ఆగిపోతాయనీ, బడులు బంద్ అవుతాయని భయంపోయింది ఆఫీసులలోకూడా మంచి క్రమశిక్షణ వచ్చింది—నిరాశ, నిస్పృహల వాతావరణం పోయి ప్రోత్సాహకరమైన వాతావరణం ఏర్పడింది. కాగితాలు కూడా త్వరితగతిని కదులుతున్నాయి"

పత్రికా రచయిత, ఆంధ్రజ్యోతి పత్రికా ప్రతినిధి శ్రీ పి. దామోదరస్వామి "ఆత్యయిక పరిస్థితి రాకముందు పత్రికా విలేఖరిగా అనేక ఇబ్బందులు ఉండేవి. ఒకవైపు సన్మానసభ అని ఫోన్, రెండోవైపు బంద్ చేయిస్తున్నామనిఫోన్, నిరసన ప్రదర్శనలనీ, ఊరేగింపులనీ, ధరలవ్యతిరేక ప్రదర్శనలు, కార్మికులకు జీతాలుపెంచమని సమ్మెలు—అన్నివైపులనుంచి ఒత్తుడులు ఉండేవి వాతావరణం ఏదో భయసందేహాలతో నిండిఉండేది ఇప్పుడు చక్కని వాతావరణం ఏర్పడింది. అన్ని ప్రభుత్వశాఖలు ఉత్సాహంగా, దక్షతతో పనిజేయవలసిన తరుణం యిది"

న్యూసైన్సు సాయం కళాశాలలో బి. ఎ. తరగతి చదువుకుంటున్న శ్రీ పేరి చక్రపాణి అత్యవసర పరిస్థితి తర్వాత విద్యార్థి లోకంలో ఏర్పడిన చైతన్యాన్ని వివరిస్తూ "ఆత్యయిక పరిస్థితి ఏర్పడకపూర్వం మీకు తెలుసు విద్యార్థులు ఎలాఉండేవారో కాలేజీ లన్నా, లెక్చరర్లన్నా నిర్లక్ష్యం, రోడ్ల కూడలిలో, సినిమాహాలుల దగ్గర నిల్చొని కబుర్లతో కాలంవెళ్ళబుచ్చేవాళ్ళం—లెక్చరర్లుకూడా ఒక్కొక్క పీరియడ్ (గంట) వచ్చేవారుకారు" అయితే ఇప్పటి పరిస్థితి వేరండీ! మునుపెన్నడూలేని కనీ, విని ఎరుగని క్రమశిక్షణ ఇప్పుడు లెక్చరర్లు చాలా శ్రద్ధగా కాలేజీకి వస్తున్నారు, పాఠాలు ఇదివరలో అంత శ్రద్ధగా చెప్పేవారే కారు. ఇప్పుడు పాఠాలు శ్రద్ధగా చెప్పడమేగాదు—నోట్సుకూడా ఇస్తున్నారు. విద్యార్థులతో కలిసిమెలిసి ఉండాలన్నట్లు లెక్చరర్లు వ్యవహరిస్తున్నారు. విద్యార్థులు, లెక్చరర్ల మధ్య సంబంధాలు మెరుగవుతున్నాయి".

బద్రుకా కళాశాలలో బి.కాం చదువుకుంటున్న ఒక విద్యార్థి శ్రీ బండారు శారాబందరావు మాట్లాడుతూ కళాశాలల్లో, మాలో నూతన పరిణామం వచ్చిందన్నారు. "ఇప్పుడు ప్రతినెలా పరీక్షలను నిర్వహిస్తున్నారు. నేను బి కాం. మొదటి సంవత్సరం, రెండో సంవత్సరం చదివేటప్పుడూ పరీక్షలుగాని, స్లిప్ టెస్ట్‌లుగాని ఏమీ జరపలేదు అందువల్ల గత సంవత్సరంలో మా తరగతిలో తక్కువమంది పాసయ్యారు. ఇప్పుడు ఎక్కడోగాని లెక్చరర్లు ప్రవేటుగా ట్యూషన్లు చెప్పడంలేదు. పుస్తకాలు మార్కెట్లలో దొరికేవికావు. కాగితం ధర విపరీతంగా వుండేది. ఇప్పుడు పుస్తకాలు బజారులో దొరుకుతున్నాయి. ఇది నిజంగా చెప్పుకోతగిన పరిణామం కాదంటారా"

లింగంపల్లిలో ప్రభాత్‌టాకీస్‌దగ్గర రాత్రిసమయాల్లోపల్లీలు అమ్ముకొని జీవనాన్నివెళ్ళబుచ్చుతున్న కాచిగూడ వాస్తవ్యులు మహమ్మద్ యూసఫ్ "ఈ ఎమర్జన్సీ పెట్టినాక ధరలు తగ్గాయి. నేను వేరుశెనగకాయలు వ్యాపారం చేసుకుంటున్నాను. ఇదివరలో వేరుశెనగకాయలు వేపించటానికి, కట్టెలుకొనటానికి చాలాకష్టంగా ఉండేది. పది కిలోల కట్టెలు 32 రూపాయలు అప్పుడు, ఇప్పుడు 24 రూపాయలనుంచి 28 వరకు ధర వుంది. మాలాంటి పేదోళ్ళు తినే బియ్యం కిలో రెండురూపాయలు ఉండేది. కొనటం చాలా కష్టంగా ఉండేది. ఇప్పుడు కిలో 1 60 పైసలు ఉన్నది మంచినూనె తొమ్మిది, పదిరూపాయలు కూడా ఉండేది సాబ్. ఇప్పుడు ఏడు ఏడున్నర రూపాయలకు దొరుకుతూంది సాబ్. పంచదారకు కిరసనాయలుకు క్యూలో నిలబడితే కొంతమందికి ఇచ్చి ఇక లేదనేవారు సాబ్ ఏ కంట్రోలువస్తువునైనా అలాగనేవారు సాబ్. కాని ఈనాడు పరిస్థితులు మారాయి."

ఈ అత్యవసరపరిస్థితిలో కిరాణావర్తకుల స్థితిగతులు ఏమిటో తెలియజెపుతూ హిమాయత్‌నగర్‌లో గాంధీ కిరాణాస్టోర్సు యజమాని శ్రీ లక్ష్మీచంద్ "ప్రభుత్వం మా దగ్గరఉన్న సరుకుల నిల్వలను తెలియజెప్పేబోర్డును పెట్టమంది. ఆ విధంగా నిల్వలను, ధరల పట్టికలనుకూడా పెడుతున్నాం. ధరవరలు తగ్గాయి. ప్రభుత్వ

(తరువాయి 26వ పేజీలో)

# పేదలకు

ప్రధాన మంత్రి ప్రకటించిన 20 - సూత్రాల ప్రణాళిక పూర్తిగా కొత్తదేమీ కాదు ఇందులోవున్న ప్రధానాంశం ఏమంటే యీ పథకం సంఘంలో వెనుకబడివున్న రకరకాల వర్గాల ప్రజల ఆర్థిక అభ్యున్నతికి అత్యంత ప్రాధాన్యం యిచ్చింది.

సమాజంలోని ఆర్థిక అసమానతలు తగ్గనిదే మనం సోషలిజం సాధించలేము. చిన్న రైతులూ, రైతు కూలీలూ, చేతి వృత్తులవారూ, హరిజనులూ, గిరిజనులూ, పట్టణాలలో కార్మికులూ, యితర బడుగువర్గాలవారూ, యింకా ఎన్నో రకాల పేదవారికి దొరికిన పెన్నిధిగా 20-సూత్రాల పథకం దేశ వ్యాప్తంగా అమలు జరుగుతున్నది

# పెన్నిధి







తెలారితే చాలు, కోటి విద్యలతో కూటికి పరుగులు పెడతాడు సామాన్య పౌరుడు. బడుగు వర్గాల ఆర్థికాభ్యున్నతికి శాయశక్తులా కృషి చేసేందుకు ప్రభుత్వం కృత నిశ్చయంతో వుంది. "దేశంలో పేదరికం నిర్మూలించడమే మన లక్ష్యం" అంటారు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ.









( 23 వ పేజీ నుండి )

ఉద్యోగులు మా దగ్గరకు తనిఖీకి వస్తున్నారు. ఇప్పుడు కిరాణా వర్తకం మునుపటిఅంత లాభంలేకుండాపోయింది" అన్నారు.

లాభాలు ఇదివరలో నూటికి 10, 15 శాతం ఉండేవి కాని యిప్పుడు 4 నుంచి 5 శాతం లాభాలు మాత్రమే ఉంటున్నాయి. సూపర్ బజార్లు మాకు పోటీగా వస్తున్నాయి ప్రజలు అక్కడకి పోయి సరకులు కొనుక్కొంటున్నారు. వ్యాపారరంగంలో లాభాలు తగ్గిపోయాయి" అని యజమాని శ్రీ లక్ష్మీచంద్

కేంద్ర సాంఘిక సంక్షేమ మండలిలో పనిచేస్తున్న శ్రీమతి తల్లాప్రగడ సరోజినిగారు మాట్లాడుతూ "ప్రస్తుతపరిస్థితిలో ఆఫీసులలో చురుకుదనం కన్పిస్తున్నది. పనిభారం ఆఫీసులలో పెరిగింది. పనులు త్వరితంగా పూర్తి అవుతాయని ప్రజలు, సంస్థలు పిటీషన్లు పంపిస్తున్నారు కొత్త పథకాలు ప్రారంభించటంవల్ల పని ఒత్తిడి ఎక్కువైంది కార్యాలయాల్లో పొదుపు చర్య కారణంగా కొత్తగా పోస్టులు యివ్వకపోవడంవల్ల ఎక్కువసేపు పనిచేయవలసివస్తుంది'' అన్నారు

పలక్‌నామాదగ్గర నివసించే రిక్షావాలా శ్రీరాములు హరిజనుడు ఆయనను ఇంటర్వ్యూచేసినపుడు "ఎమర్జన్సీ పెట్టినారుకదా, దానితో ధరలుతగ్గినాయి. ఇదివరలో చాలా భయంగా ఉండేది. ఎప్పటికప్పుడు, ఏరోజుకారోజు ధరలు పెరిగిపోతుండేవి. రిక్షా తొక్కితే మహా ఉంటే ఐదురూపాయలు రోజుకు ఉండేది. హోటళ్ళలో రేట్లుపెరిగిపోయాయి. బియ్యంధర చూస్తే నిజంగా భయమేసిపోయేది. ఒక్కొక్కసారి అర్థాకలితో ఉండేవారం. మా పేదోళ్ళకి ఏంకావాలి? బియ్యంధర, నూనెధరలు, కూరగాయలు ధర తగ్గిఉండేచాలు ఈ నాలుగునెలల నుంచి ధరలు హెచ్చకుండా ఉండినాయి నేను ఇళ్ళస్థలం గురించి దరఖాస్తుపెట్టుకున్నా. నాకాగితం ఏమైందో తెలియలేదు మొన్ననే ఆఫీసర్లువచ్చి పేర్లు వ్రాసుకొనిపోయారు త్వరలో యిండ్లస్థలం వస్తుందని చెప్పారు అన్నారు

నల్లగుట్ట తిలక్‌నగర్‌లో ప్రభుత్వం 300 మంది నిరుపేదలకు నివేశనస్థలాలు అందజేసింది? ఆనివేశనస్థలాన్ని పొందిన శ్రీ నరసింగరావుగారిని అడిగినపుడు "ఈ హైదరాబాద్‌లో మాలాంటి పేదోళ్ళను ఎవరుచూస్తారు? మన ప్రధాని ఇందిరాగాంధి పుణ్యమా అని మాకు ఉండటానికి జాగా దొరికింది. ఎన్నాళ్ళనుంచో మేం ఈ ఇళ్ళస్థలాలకి కృషిచేస్తున్నాం కాని యిప్పటికి దొరికినాయి మాకు ఉండటానికి జాగా యిప్పించినందుకు మేమెంతో ఋణపడి ఉన్నాం మాకేకాదు, చాలామందికి నివేశనస్థలాలు ఈ హైదరాబాద్‌లో ఇచ్చారు".

# జీసస్

శ్రీ వి. సంపత్కుమారాచార్య

మనిషి కోసం మనిషిగా పుట్టి
మనిషిని మనీషిని చేయబోయి
చివరకు
ఆ మనిషి చేతనే శిలువ వేయించుకున్న
అమాయకుడా ! ! .
నీ కనుల ముందే నిన్ను పరిహాసం చేసిన మా లోకం
నువ్వు కనుమరుగైతే నీ ఆశయాల నాచరిస్తుందా?
మంచి తనానికి రోజులు కావు
సంకుచితానికి హద్దులు లేవు
వంచకత్వమే ధ్యేయంగా ..
హారకులమై... పదాశంకల సం
హారకులమై...
పురోగ మిస్తున్నా మన్న తిరోగమనపు భ్రమలో
కొట్టు ట్టాడుతూ... అవతారాలు మారుస్తూ
పెరిగి పోతూన్న లోకం మాది !.........
నీ పవిత్రాశయాలను
నీ తోపాటుగా నీ స్మృతి చిహ్నాలలో బంధించి
చిలుక పలుకులు పలుకుతూన్న మాకు
నీ బోధనలతో అవసరమేముంది చెప్పూ ! ...
పలుకులలో గులాబీలొలికిస్తూ
ములుకులు మెత్తగా గుచ్చే మాకు
నీ ఆశయాల మననంతో అవసర మేముంది చెప్పు!
రోగ హారివైన నీ చల్లని చేతులలో
ఇనుప మేకులు గుచ్చి ఆనందించాం ! ! ...
పాపాత్ములనే ఆదరించిన నీ లోకంలో పుట్టి
పుణ్యాత్ముల చాపక్రిందికి నీళ్ళు తెస్తున్నాం ! !...
మా గమనం... యీ భ్రమణం
ఏ చీకటి కోణంలోనికి కొనిపోతుందో తెలియదు.
అయినా
నీ దయతో... నీ క్షమతో
మా కనులముందు క్రమ్మిన పొరలను చీల్చి...
వెలుగులను ప్రసరించి...
మానవతలో మానవతను పెంచి
ఈ జనతలో సుఖశాంతులకాస్కారం కల్పించు !
జీసస్ ! !...
ఒంజలితో ఇచ్చే ఈ అంజలిని గ్రహించు !!

# మహాభారతము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 91

"నాయనా! ఈ సరోవరముయొక్క నీరుత్రాగుటకు సాహసము చేయకుము దీని పైన పూర్వము నుండియే నాకు అధికారము కలదు తొలుత నా ప్రశ్నములకు ఉత్తరము చెప్పుము తరువాత నీరు త్రాగుము నీవు నీరు తీసికొనికూడ పొమ్ము". ఆకాశవాణి మాటలను నిర్లక్ష్యముచేసి నకులుడు చాల దప్పిగొన్నవాడై చల్లని నీరు త్రాగి క్రింద పడిపోయెను నకులుడు తిరిగి వచ్చుటకు జాగైనందు చేత యుధిష్ఠిరుడు సహదేవునితో "నీవు పోయి నీ సోదరునితో పాటు నీరు గూడ తెమ్ము" అని చెప్పి పంపెను సహదేవుడాదిక్కుననే పోయి సరోవరతీరమునందు పడియున్న నకులుని చూచెను. అతడు మిక్కిలి దుఃఖించి, దప్పిగొన్నవాడుగాబట్టి తొలుత నీరు త్రాగుటకు పోయెను. పూర్వము వలెనే ఆకాశవాణి మాటలు సహదేవునికికూడ వినవడెను. అతడు గూడ ఆ మాటలను లెక్కచేయక నీరు త్రాగి నకులుని వలెనే క్రింద పడిపోయెను.

"అప్పుడు యుధిష్ఠిరుడు అర్జునునితో 'నాయనా! నీతమ్ములు పోయిచాల సేపైనది తిరిగిరాలేదు. దుఃఖించిన మాయందరికి నీవే దిక్కుగదా! కనుక నీవు త్వరగా పోయి నీ తమ్ములతోపాటు నీరు గూడ తీసికొనిరమ్ము' అని చెప్పిన తోడనే అర్జునుడు అతి మేధావి కనుక ధనుర్బాణములను, ఖడ్గమును ధరించి సరోవరమును చేరెను. అక్కడ నిద్రించినవారివలె పడియున్న నకులసహదేవులను చూచి ధనుస్సునెక్కుపెట్టి ఆ వనమునందు నలుపైపుల చూచెను అచ్చట హింస్రములైన యే జంతువులుగాని, క్రూర రాక్షసాదులుగాని కనిపించలేదు. తమ్ములవలెనే తానును దప్పిగొన్నవాడుగాబట్టి తొలుత నీరు త్రాగుటకు కొలనిలోదిగెను అప్పుడు ఆకాశవాణి 'కుంతీకుమారా! నీటి వద్దకు ఎందుకు పోవుచున్నావు! నీవు బలవంతముగా నీరు త్రాగజాలవు. నా ప్రశ్నములకు ఉత్తరము చెప్పి నీరు త్రాగి నీరు తీసుకొని కూడా పొమ్ము" అనెను.

"అట్లు నివారింపబడుచు అర్జునుడు, 'ఓయీ! నీవు నాకు కనపడి నన్ను నివారించుము నా బాణములచే దెబ్బతిన్న తరువాత ఇట్లు నీవు పలుకవు' అని చెప్పి దిక్కులు దద్దరిల్లునట్లుగా అస్త్రములు మంత్రములను అభిమంత్రించి శబ్దవేధిబాణములను ఆ ధ్వని వచ్చిన దిక్కునందు కురిసెను. పిపాసాపీడితుడైకూడ అర్జునుడు అమోఘములైన అనేక బాణములను వర్షించెను అప్పుడు యక్షుడు 'పార్థా! ఇట్లు బాణములను ప్రయోగించుట చేత ఉపయోగములేదు నా ప్రశ్నములకు బదులు చెప్పి, తరువాత నీరుత్రాగుము ఉత్తరము చెప్పక నీరు త్రాగినచో నీవు గూడ నీ తమ్ములగతినే పోయెదవు. బ్రతుకజాలవు.' అని చెప్పెను అర్జునుడు ఆ మాటలను సరకు చేయకయే నీరు త్రాగి తమ్ముల వలెనే క్రింద పడిపోయెను

"ఎంత సేపటికిని అర్జునుడు గూడ తిరిగి రాకుండుటచేత ధర్మరాజు 'నీవు వెంటనే పోయి తమ్ములతో పాటు నీరు గూడ తెమ్ము' అని చెప్పి భీమసేనుని పంపెను వెంటనే భీముడు సరోవరము వద్దకు పోయి, అక్కడ పడియున్న తమ్ములను ముగ్గురిని చూచి, మిగుల దప్పిక గొన్నవాడగుటచేత,' ఇది యక్ష-రాక్షసుల పనియే' యని నిశ్చయించుకొని 'తొలుత నీరు త్రాగి-తరువాత వారితో యుద్ధము చేసెద' నని నీటి వద్ద కరిగెను. పూర్వము వలెనే ఆకాశవాణి, భీమునకుగూడ 'ప్రశ్నములకు బదులు చెప్పక నీరు త్రాగినచో నీ తమ్ముల గతియే నీకును పట్టును.' అని వినపడెను ఆ మాటలను సరకు చేయకయే యితడుగూడ నీరు త్రాగి తమ్ములవలెనే పడిపోయెను

"తరువాత ధర్మరాజు చాల సేపు వారు రాకుండుటను చూచి మిగుల చింతించి మనస్సు దహించుకొని పోవుచుండగా అక్కడి నుండి లేచి యే మాత్రము జనుల అలికిడి లేక, అనేక మృగ-పక్షి-వరాహాదులు గల ఆమహావనమునందు ప్రవేశించెను ఆ సమీపము నందే సువర్ణ వర్ణముగల కుసుమ కేసరముల చేత కప్పబడియున్న నీరుగల సరోవరమును చూచెను. అది విశ్వకర్మచేత నిర్మితమై యుండెను ఆ సరస్సు అనేక కమలములచేతను, నాచు తీగల చేతను కప్పబడి అనేక పుష్పఫల వృక్షముల చేత చుట్టబడి యుండెను తమ్ములను చూడవలెననెడి తొందరపాటుగలవాడై శ్రమను ఓర్చి కూడ ఆ కొలనికడకు పోయి, అక్కడ ప్రళయ కాలమునందు పడియున్న లోకపాలురతోను, ఇంద్రునితోను సములైన తమ్ములను ఒక్కొక్కరిని చూచి దుఃఖించుచు నిట్లు తలపోసెను :—

### ధర్మరాజు తమ్ములను చూచి దుఃఖించుట

"అర్జునుడు మరణించి పడియుండెను. అతని ధనుర్బాణము చెదరుగా పడియుండెను. భీమ-నకుల-సహదేవులు గూడ

చేష్టలుడిగి చచ్చి పడియుండిరి· అట్లు పడియున్న తమ్ములను చూచి ధర్మపుత్రుడు ఉష్ణమైన విశ్వాసమును దీర్ఘముగా విడిచి, శోక బాష్పములు నిండిన ముఖము గలవాడై చింతతో అధికముగా దుఃఖించుచు నిట్లనెను ·–

"భీమసేనా ! యుద్ధమునందు నీవు దుర్యోధనుని రెండు తొడలు విరుగగొట్టెదనని ప్రతిజ్ఞ చేసియుంటివి కురుకులము యొక్క కీర్తిని పెంపొందింపజేయువాడవుగా నుంటివి. నీ హృదయము అతి విశాలము. వీరవరా ! నేడు నీవు పడిపోవుటచేత అవి యన్నియు వ్యర్థములయ్యెనుగదా ! సాధారణ మనుష్యుల మాటలు, ప్రతిజ్ఞలు అసత్యములు కావచ్చును. కాని మిమ్ముగూర్చి వెలువడిన దివ్యవాక్కులు అసత్యము లెట్లగును ?

"అర్జునా ! నీ జన్మకాలమునందు దేవతలు మన తల్లితో 'కుంతీ ! ఈ నీ పుత్రుడు సహస్రాక్షుడైన యింద్రునకంటే ఏ విషయమునందును తీసిపోడు' అని అనియుండిరి గదా ! ఉత్తర పారియాత్ర పర్వతమునందున్న ప్రాణులన్నియు నీ విషయమై 'ఈ యర్జునుడు పాండవులు పోగొట్టుకున్న రాజ్యలక్ష్మిని తిరిగి శీఘ్రముగా సంపాదించగలడు. యుద్ధమునందు ఎవడు గూడ ఇతనిని జయించజాలడు. ఇతడు గూడ ఎవనిని ఓడించకుండ ఉండడు' అని చెప్పియుండెను గదా ! అటువంటి నీవు ఇప్పుడు మృత్యువువాత ఎట్లు పడితివి ? నా ఆశాలతను ఛేదించివేసి నేలపైన పడియున్నావు. నిన్ను మాకురక్షకునిగా ఆశ్రయించి అన్ని దుఃఖములను సహించియుంటిమికదా !

"యుద్ధమునందు మదించిన యేనుగువలె శత్రువులను సంహరించు వీరులు, మహాబలశాలురునగు కుంతీపుత్రులైన భీమార్జునులు ఏలాటి అస్త్రములకు గూడ లొంగనివారుగదా ! అట్టివారిప్పుడు శత్రువశులెట్లైరి ?

"నా హృదయము నిశ్చయముగా ఇనుముతో చేయబడినది. అట్లు కాకున్నచో, ఇట్లు పడియున్న నకుల సహదేవులనుచూచి అది చీలిపోకయుండునా ? పురుషసింహులైన సోదరులారా ? మీరు శాస్త్రజ్ఞులు, తపస్సంపన్నులు, దేశకాలముల నెరిగినవారు, కర్మవీరులు గదా ! మీ యోగ్యతలకు తగిన సాహసకృత్యములను చూపించక చచ్చినట్లు ఏల పడియున్నారు ? మీ శరీరములకు గాయములైన తగులలేదే ! ధనుర్బాణములను తాకనైనలేదే ! మీరు ఎవరిచేతను ఓడిపోవువారుకారే ! అట్టి మీరు తెలివిదప్పి యీ నేలపైన ఎందుకు పడియున్నారు "

" పరమబుద్ధిమంతుడైన యుధిష్ఠిరుడు భూమిపైన పర్వతసానువులు (చరియలు) వలె పడి సుఖనిద్రచెందుచున్నట్లున్న తమ్ములనుచూచి, శరీరమంతటను చెమటపోయగా, ఖిన్నుడై అత్యంత దురవస్థపాలయ్యెను. 'ఇది యింతయయ్యెనా' అని చెప్పి ధర్మరాజు దుఃఖసముద్రమధ్యమునందు ఉండి, తమ్ములు పడుటకు కారణమును గూర్చి చింతించెను. దేశకాలముల స్వరూపములను బాగుగా గుర్తెరిగి, మహాబుద్ధిమంతుడు, మహాబాహుపరాక్రమశాలియునైనప్పటికిని యుధిష్ఠిరుడు, ఎంత విచారించినను 'ఇప్పుడు ఏమి చేయవలెను' అను విషయమునందు ఒక నిశ్చయమునకు రాజాలక, ఇతికర్తవ్యతామూఢుడై యుండెను.

"ఇట్లు అనేక విధముల దుఃఖించి ధర్మపుత్రుడు మనస్సును స్థిరపరచుకొని, 'ఈ వీరుల నెవరు పడగొట్టిరి ? వీరి శరీరములయందు ఆయుధముల దెబ్బల గుర్తులుగూడ లేవే ! ఇక్కడ ఎవరి అడుగుల గుర్తులుగూడ లేవే ! ఏదో మహాభూతమువచ్చి నా తమ్ములను చంపియుండును' అని తలపోసెను 'ఈ జలమును పానము చేసి, యేకాగ్ర మనస్సుతో చింతించెదను లేదా, ఈ రహస్యమును కనుగొనుటకు యత్నించెదను ఒకవేళ దుర్యోధనుడే రహస్యముగా ఈ కార్యమును చేసియుండును లేదా, యిది సర్వదా కుటిలబుద్ధిగల శకుని కార్యమయియుండును అతనికి కార్యాకార్యములు రెండుగూడ సమానములుగానేయుండును. దుష్కార్యములను చేయునట్టి ఆ పాపిష్ఠుని ఏ వీరుడు విశ్వసించును ? లేదా, ఆ దురాత్ముడైన దుర్యోధనుని గూఢవారులే యీ హింసా కార్యములనుచేసి యుందురు· ఈ జలమునందు విషముగూడ కలిసినట్లు లేదు విషప్రయోగమయియుండిన యెడల, వీరి శరీరాకారములు వికృతములుగ నుండవలెను గదా ! అట్లు కనబడుటలేదే ! నా తమ్ముల ముఖవర్ణములు ప్రసన్నముగానే యున్నవిగదా ! ఈ నా ఒక్కొక్క తమ్ముని శరీరమునందు అగాధ బలమున్నది. అట్టి పురుషశ్రేష్ఠులను ఎదిరించుటకు ప్రళయకాల యముడుదప్ప ఇతరుడెవ్వడు సమర్థుడగును ?"

"ఇట్లు చింతించి ధర్మరాజు దప్పిదీర్చుకొనుటకై నీటియందు దిగుచుండగానే అంతరిక్షమునుండి యక్షునిమాటలు వినపడెను. అప్పుడు ఇద్దరికి నిట్లు సంవాదము జరిగెను :– (సశేషం)



# సన్నకారు రైతుకు సౌభాగ్యం

అధిక దిగుబడి వంగడాలు, ఉత్తమ యాజమాన్య పద్ధతులు, సకాలంలో సరైన మోతాదులో ఎరువు, సస్యరక్షణ వీటన్నిటివి వ్యవసాయనిపుణుల సాంకేతిక సలహాలతో తన అనుభవాన్ని మేళవించి, పట్టుదల బూని, ప్రతిఫలంగా ఎకరానికి 3,300 కిలోల వరి దిగుబడిని సాధించిన కర్షకు నాయకుడు–శ్రీ దాట్ల పెద్దిరాజు.

శ్రీ పెద్దిరాజు ప్రయోగ క్షేత్రం పశ్చిమ గోదావరి జిల్లా పెరవలి సమితికి చెందిన కుగ్రామం, గుమ్మంపాడులో మున్న ఎ. 2–30 లు మాత్రమే. అతని వయస్సు కూడా 28 సంవత్సరాలే. అనుభవంలో చిన్నవాడైనా, కొత్తకొత్త వ్యవసాయ పద్ధతుల్ని చేపట్టటంలోను, కొంగ్రొత్తయైన అభ్యుదయ ఆలోచనా ధోరణులను స్వీకరించటం లోనూ అపూరికే ప్రతినిధి అయ్యాడు. అధికంగా పెట్టుబడి పెట్టేవారికే అధిక దిగుబడి ఇచ్చే వంగడాలన్న భ్రమను పోగొట్టి గ్రామంలోని సామాన్య రైతాంగానికి మార్గదర్శకుడయ్యాడు. సామాన్యులలో అసామాన్యుడుగా పేరొందాడు.

1974–75 దాళ్వా కాలంలో గుమ్మంపాడు అనేక జిల్లాల రైతు సోదరులకు సందర్శనా క్షేత్రమైంది. పాత్రికేయుల బృందాల ప్రశంసలకు పాత్రమైంది. ఇదే సంవత్సరం జిల్లాలోనే ఉత్తమ వ్యవసాయక గ్రామంగా యెన్నికై రాష్ట్ర వ్యవసాయశాఖ చేత రూ. 2,000 ల బహుమతిని బడిసింది.

విద్యుద్దీపాలుగాని, ఉన్నతవిద్య, వైద్య సౌకర్యాలు గాని కనీసం సరైన రహదారి వసతిగాని లేని యీ గ్రామం అందరూ మెచ్చే విధంగా ఎందరో చూసి తెలుసుకునే విధంగా వ్యవసాయ రంగంలో అద్భుతాలు సాధించటానికి గ్రామంలోని రైతులందరూ కారణమైనా, శ్రీ పెద్దిరాజు వంటి ఒకరో ఇద్దరో మాత్రమే ఆ కారణానికి కారకులు గుమ్మంపాడులో ఈ నాడు ప్రతి ఎకరం లోనూ అధిక దిగుబడి వంగడాలు వేస్తున్నారంటే శ్రీ పెద్దిరాజు పాత్ర దీనిలో చాలా ఉంది. అందరికంటే ముందుగా అధిక దిగుబడి వంగడాలను తెచ్చాడు. రెండు మూడేళ్లగా వాటి ఫలితాన్ని చూపిస్తూ వస్తున్నాడు. గ్రామంలో మొట్టమొదటి సారిగా మూడు పంటలు పండించి నాందీవాచకం పలికాడు. సార్వాలో 'జయ' వేశాడు. దాళ్వాలో 'తెల్లహంస'ను పండించాడు మూడోపంటగా మార్చినెలలో టి. 9 మినుమువేసి ఎకరానికి 600కిలోలను సాధించాడు.

1974–75 సార్వాకాలంలో తెల్లహంసను ఎ. 1–00 లోను, 'జయ'ను ఎ. 1–30 లోను నాటాడు. తెల్లహంసతో ఎకరానికి 2,800 కిలోలు రాగా 'జయ' తో 3,050 కిలోల రాబడిని పొంద గలిగాడు.

ముఖ్యంగా అందరినీ ఆకర్షించింది, మెప్పును పొందింది అతను దాళ్వాలో చేపట్టిన పద్ధతి.

సార్వా కోతలు కాగానే చేలను ట్రాక్టరుతో రెండు సార్లు బాగా దమ్ము చేయించాడు. నీరు 5 అంగుళాలు ఉండేటట్లు చేశాడు. ఈ నీటిని ఊడ్చేటంతవరకు ఆరకుండా చేశాడు.

మరోవైపున నారుమడిని యింకోచోట వేశాడు. 20 సెంట్లను బాగా చదునుచేసి, నవంబరు 8వ తేదీ నాటికి శుద్ధి చేసిన ఆర్.పి. 4–14, జయ విత్తనాలను పోశాడు. ఎకరానికి 30 కిలోల చొప్పున పోశాడు. దమ్ములో 50 కిలోల అమ్మోనియం సల్ఫేటు, 30 కిలోల సూపర్ ఫాస్ఫేటు, 10 కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్ వేశాడు. 10 రోజులైన తర్వాత ఒక కిలో ఫిమ్మెట్ గుళికలు జల్లాడు. 24వ రోజున పారాథియాన్ పిచికారి చేశాడు. ఇక నారు 26 రోజుల నాటికి 4, 5 ఆకులు తొడిగి చూడముచ్చటగా వచ్చింది. ఊడ్పటానికి సిద్ధమైంది.

---

**శ్రీ జి. కృష్ణమూర్తి**

---

ఎ. 1–30 లో ఆర్. పి. 4–14 ను, మిగతా ఎకరంలో జయను ఊడ్చాడు. దీని ముందు మళ్ళీ దమ్ముచేసి చేనును ఎత్తు పల్లాలు లేకుండా చేశాడు. దగ్గర దగ్గరగా కుదురుకు ఒకటి రెండు మొక్కలు చొప్పున ఒత్తుగా ఊడ్పించాడు. పైపైన ఊడ్పటావి కనుపుగా ఒకరోజు ముందుగా చేలో నీరు పల్చగా ఉండేటట్లు చేశాడు. చేలో ప్రతి 8 అడుగులకి 10 అంగుళాలు ఉండేటట్లు దార్లు తీశాడు. ఇవి ఎరువుల్ని, సస్యరక్షణ మందుల్ని చేనంతా సమానంగా పడేటట్లు చల్లటానికి తర్వాత బాగా ఉపకరించినవి.

ఊడ్చేటప్పుడు దమ్ములో ఎకరానికి 100 కిలోల సూపర్ ఫాస్ఫేటు, 40 కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్ ఎరువులను పెట్టాడు. ఊడ్చిన 12వ రోజున ఎకరానికి 50 కిలోల అమ్మోఫాస్ (28:28) 30వ రోజున 50 కిలోల యూరియా వేశాడు. ఎరువువేసే ఒక రోజు ముందు నీరుతీసి, 2 రోజుల తర్వాత నీరు పెట్టాడు. ఆ తర్వాత 2 అంగుళాలు తగ్గకుండా 55 రోజుల వరకూ చూశాడు. ఆ పిదప మాత్రం 5, 6 అంగుళాల వరకు తగ్గనీయలేదు.

ఊడ్చిన 10వ రోజున మణిదలు వేశాడు.

పురుగు నివారణకై అవసరమైనపుడు మాత్రమే సస్యరక్షణ చర్యలు తీసుకొన్నాడు మొవ్వ ఆకుముడత పురుగు నివారణకై ఫసూఫియాన్ ఎకరానికి 300 మి. లీ. చొప్పున స్ప్రే చేయించాడు.

ఆ తర్వాత యీ క్షేత్రాన్ని సందర్శించిన అఖిల భారత వరి పరిశోధనా నిపుణులు చేలో జింక్ లోపమున్నట్లు తెల్పగా ఎకరానికి జింక్ సల్ఫేట్ 1 కిలో, ½ కిలో సున్నం చొప్పున కలిపి రెండు సార్లు చల్లాడు పైరు దోమకాటుకు గురికాకుండా వారం వ్యవధిలో రెండు సార్లు బి హెచ్ సి. 10% మందులు చల్లాడు.

రెండుసార్లు పైరు మీదున్న కలుపులను వేరుచేశాడు.

కర్ర పచ్చిమీద ఉండగానే మార్చి 10వ తేదీన ఆర్ పి. 4–14ని, మార్చి 20న జయను కోత కోయించాడు.

కష్టే ఫలే అన్నట్లు ఆర్.పి. 4–14 రకం ఎకరానికి 3,250 కిలోల దిగుబడిని స్తే, జయ ద్వారా ఎకరానికి 3,300 కిలోల రాబడిని పొందగలిగాడు

అందుకే కృషితో నాస్తి దుర్భిక్ష మన్నారు.

# "గర్వంగ నగుతాన్న"

ఇయాల్ల
సప్పట్లు కొట్టుకుంటున్న
కాళ్ల కేతుల బేడీలూడినంక
ఈ పొద్దుగాల్ల నగుతాన్న
నా కొడుకులు, బిడ్డలు
తెలివి కళ్ళోలయింద్రని
ఎగిసే ఎగిసి ఉరికే
ఎర్లకు కట్టలేసి
ఎగుసము బాగు శేషకుంద్రని
కొండల నడిమిల్ల నుంచి
లోయల్ల వడే లీళ్ల నుంచి
బిజిలీతీసి ఊళ్లల్ల
కరంటు బుగ్గలేస్కుంద్రని
ఈ పొద్దుగాల్ల నగుతాన్న
ఇండ్లిచ్చి
తావులిచ్చి
భూమిలిచ్చి
ఎదల పొదల్ని తుడిసి
మనస్సుల్ని నవ్వేటట్లు శేష కోటం సూసి
ఇయ్యాల్ల నగుతాన్న
నా బిడ్డలు తెలివి కళోలయింద్రని
రాజులకు మహా రాజులకు
భోగాలు భాగ్యాలు
ఇవ్వకుంట శేసి
అందర్ని ఒక మేరంగ శేత్తున్నందుకు
ఈ పొద్దుగాల్ల నగుతాన్న
ఎం శెప్పకోవాలె
పెద్దరికం శెప్పకున్నట్లయితది

బాక్రానంగల్
నాగార్జునసాగరం
పోశంపాడు ప్రాజెక్టులు సూసి
పనుల సక్కదనం సూసి
నా బిడ్డలు తెలివి కళ్లోలయింద్రని
పొద్దుగాల్ల నగుతాన్న
బిలాయిసూసి
మాచ్‌ఖండ్ సూసి
రూర్కెలా సూసి
శిన్న శిన్న పరిశ్రమల్ని సూసి
అక్ల శేశేట
ఇద్దట్ని సూసి
బుద్ధుల్ని సూసి
ఈ పొద్దుగాల్ల నగుతాన్న
నా బిడలు తెలివి కళ్లలయింద్రని
పాకిస్తానోడు
మిసాలు మలేసినప్పుడు
సలికొండల నడిమిల్ల నుంచి
ఇమానాలమీది నుంచి
సముద్రం లీళ్ల నుంచి
పగదార్లను పారగొట్టిన
ఈరుల్ని నా జవాన్లను సూసి
ఈ పొద్దుగాల్ల నగుతాన్న
బంగ్లాదేశ పోల్లకు
సతంత్ర మిప్పించి
పపంచమున ఇందిరవ్వ
పేరు తెచ్చుకొందని
నా బిడ్డలు తెలివి కళ్లోలయింద్రని
పొద్దుగాల్ల గర్వంగ నగుతాన్న

శ్రీ టి. కృష్ణమూర్తి

# నిరాశలో నిండు గుండె

— సి. ఆనందారామం

**జ రి గి న క థ :**

జైలు నుండి విడుదలయిన చిరంజీవి, సి. ఐ. డి ఆఫీసర్ మోహన్‌తో పరిచయం పెంచుకుంటాడు. హోటల్ లోటస్‌లో ప్రసూన, మోహన్ కాకతాళీయంగా కలిసి తమ కాలేజీ రోజుల్ని తిరగదోడుకుంటారు. చిరంజీవికోసం బయలుదేరిన మోహన్ శ్యామ్‌నూ, నర్తకి రేఖనూ పబ్లిక్ పార్క్‌లో చూసి విస్తుపోతాడు. శ్యామ్ తండ్రి జనార్దన్ మోహన్‌ను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించాడు.

ఒకనాడు పూరి గుడిశల్లో వున్న సాంబశివం యిప్పుడు మేడల్లో వుంటున్నాడు. ఐశ్వర్యం ఎరచూపి బి. ఎ. చదివిన లలితను పెళ్ళి చేసుకున్నాడు. సాంబశివం పశుత్వాన్ని భరించ లేకున్నా తనలో పుట్టి పెరుగుతూన్న పాపకోసం బ్రతకవలసి వచ్చింది. ఇప్పుడు ఆ పాప పెద్దదై వయస్సులోవుంది. సాంబశివం పోగుచేసే స్నేహితుల మధ్య వదిలి వెళ్ళలేక బోనులో వున్న మృగరాజులా యింటి నంటిపెట్టుకుని వుంటోంది లలిత.

## 5

సాంబశివం ఫోన్‌చేసి ప్రసూనను తన గదిలోకి పిలిపించు కున్నాడు సాంబశివం పేరువింటే హోటల్‌లో పనిచే సేవారందరూ గడగడలాడిపోతారు. అతనికి భయపడనిది ప్రసూనఒక్కర్తే... సాంబశివం ఉగ్రనరసింహరూపం ప్రసూన ఎన్నడూ చూడలేదు... ప్రసూన ముందు ఎన్నడూ ప్రసన్నమైన చిరునవ్వుతోనే ఉంటాడు సాంబశివం...

"నిన్న మోహన్‌ని నీ గదిలోకి పిలిపించావా?" అన్నాడు సాంబశివం...

ప్రసూన తడబడింది...ప్రసూన గదిలోకి సాధారణంగా ఎవ్వరూ రావటానికి వీల్లేదు...హోటల్ ఉద్యోగస్థుల్లో ఎకౌంటెంట్ శేఖర్, డాన్సర్ రేఖ మాత్రమే వస్తారు. బయటి వాళ్ళు అసలురారు. రానీయరు...ఆనాడు ప్రసూన స్వయంగా ఆహ్వానించబట్టి మోహన్ రాగలిగాడు...ఆక్షణంలో ఎవరూ ఏమీ అనక పోయినా ఆ వార్తమాత్రం వెంటనే సాంబశివానికి అందచేశారు...

"మోహన్ నాకు బాగా తెలుసు..." అంది తలవంచుకుని ప్రసూన...

"ఎలా తెలుసు?"

"చదువుకునే రోజుల్లో పరిచయముంది..."

"పరిచయం మాత్రమేనా?"

ప్రసూన బెదురుగాచూసి తలవంచుకుంది.

లోలోపల నవ్వుకున్నాడు సాంబశివం .

"అతడు మన వ్యాపారానికి సహాయం చేసేలా ఒప్పించాలి... ఈపని నువ్వు చెయ్యగలవా?"

కుతూహలంగా చూసింది ప్రసూన . ఏదో ఒక రకంగా మోహన్‌తో సంబంధం పెంచుకోవటానికి ఉత్సాహంతో ఎగసి పడింది ప్రసూన మనసు .

"ప్రయత్నిస్తాను..."

"అన్నివిధాలా ప్రయత్నించు...కష్టానికి తగిన ప్రతిఫలం... అధే–డబ్బు...దొరుకుతుందనిచెప్పు..."

"అలాగే!"

ప్రసూనను పంపించి రేఖను పిలిపించాడు సాంబశివం...

మోహన్‌ను లోబరుచుకునేందుకు ప్రసూనను నియమించినా, సాంబశివం అనుమానాలు సాంబశివానికున్నాయి. మోహన్ శ్యామ్‌పై ఎటువంటిచర్యా తీసుకోడనీ, శ్యామ్ మోహన్‌ను లోబరుచు కునేందుకు తురఫాసుగా పనికొస్తాడనీ తెలుసతనికి. అందుకే రేఖతో 'శ్యామ్'ను చెయ్యిజారిపోనివ్వద్దని' హెచ్చరించాడు. మోహన్ కోసం ప్రసూన నియమించబడిన సంగతీ చెప్పాడు.

సాంబశివం దగ్గిరనుండి తిన్నగా ప్రసూన దగ్గరకొచ్చింది రేఖ...

రేఖను చూసినకొద్దీ ఏదో చీదరగా ఉంటుంది ప్రసూనకు. అదే సమయంలో ఎందుకో జాలిగాకూడా ఉంటుంది. తనను పూసుకొని పూసుకొని తిరుగుతూ తన స్నేహితురాలినని చెప్పుకోవటం ఎంతో గర్వంగా భావించే రేఖను ఎలా విదిలించాలో అర్థం కాదు ప్రసూనకు...

విశాలంగా ఉండే రేఖ కన్నుల్లో ..విలాసంగా కదిలే ఆ కనుపాపల్లో...లోకంమీద ఏదోకసి ఎఱ్ఱగా మెరుస్తూ కనిపిస్తుంది... అది గుర్తించినపుడు ప్రసూనకు రేఖమీద గౌరవం కలగదు కాని, ఏమీ అనలేని ఏదో అసహాయత ఆవరించుకుంటుంది ప్రసూనను...

"నువ్వు మోహన్ దగ్గిరకి వెళ్తున్నావటగా?"
అంది కన్నుకొడుతూ రేఖ...

ప్రసూన గతుక్కుమంది. ఏదో జుగుప్సతో మనసు ముడుచుకు పోయింది...అంతకుముందు ఉత్సాహంతో పొంగించిన విషయమే ఇప్పుడు జుగుప్సతో దహిస్తోంది...ఒక్కొక్క విషయం చెప్పే విధానాన్ని బట్టి ఎంతగా మారిపోతుంది? రేఖకేమీ సమాధానం చెప్పలేదు...

"ఏమయినా నేర్పించమంటావా?" అంది రేఖ మళ్ళీ గంగల నవ్వుతూ ..

"అక్కర్లేదు " చిరాగ్గా అంది ప్రసూన ..

అమర్నాడు ఉదయం ఏడు గంటలకు మోహన్ నంబర్ డయల్ చేసింది "హలో!"అన్నాడు మోహన్. మోహన్ కంఠంలో మార్దవం ఉంది ....అమార్దవంలో మిళితమై ఏదో గాంభీర్య రేఖ కూడా ఉంది......అత్యంత స్నేహంతో ఆహ్వానిస్తోనే అల్లంత దూరాన నిలబెట్టగలిగే గాంభీర్యమది...ప్రసూన గొంతు కేదో అడ్డు పడినట్లయింది. వెంటనే సమాధానం చెప్పలేక పోయింది...

"హలో!" అన్నాడు మళ్ళీ మోహన్ "హలో!"అంది ప్రసూన.......

"ఓ. మీరా"నవ్వాడు మోహన్, "గుర్తుపట్టారా?"

"ఆ! ఏమిటి విశేషం?"

"ఏం లేదు-"

"ఏం లేకుండనే ఫోన్ చేశారా?"

"ఉంది......"

"ఏమిటది? ఫోన్‌లో చెప్పడానికి వీల్లేనిదా?"

"కాదు .....అవును........."

"నన్ను మీదగ్గరికి రమ్మంటారా?"

"వద్దు ......

"మీరే నాదగ్గరకు వస్తారా?"

"మీరు రమ్మంటే......"

"వద్దని ఎందుకంటాను?"

"ఇవాళ సాయంత్రం వస్తాను..."

"ఆల్ రైట్........."

ఉద్యోగంలో చేరాక జనార్దన్ ఇంట్లోంచి వచ్చేసి వేరుగా ఉంటున్నాడు మోహన్...వంటకు, ఇల్లు నిర్వహించటానికి ఒక నడివయసు మనిషిని కుదుర్చుకున్నాడు......

సాయంత్రం ఆరు గంటలకు మోహన్ ఇంటిముందు సాంబశివం కారులోంచి దిగింది ప్రసూన .....ఆ కారునూ, కారు డ్రైవరునూ పరిశీలనగా చూస్తూనే చిరునవ్వుతో " రండి " అని ఆహ్వానించాడు మోహన్......

ఇల్లు అంతపెద్దది కాకపోయినా పొందికగా అమర్చిఉంది. సోఫాలో కూచుంది ప్రసూన .....హేండ్‌బ్యాగ్ పట్టుకున్న ప్రసూన చేతివేళ్ళు వణకటం గమనించి లోలోపల నవ్వుకున్నాడు మోహన్. ఏదోకంగారుతో...బెదురుచూపులతో...ఎంతో అందంగా ఉంది ప్రసూన...కంగారును, బెదురును మించి ఏదో ఆనందం తొంగి చూస్తోంది ఆ కళ్ళలో...ప్రసూనలో ఆ కంగారును పోగొట్టాలను కున్నాడు మోహన్...ఏవోకాలేజి కబుర్లు ఎత్తుకున్నాడు... ఆ రోజుల్లో వేసిన నాటకాలు...అప్పుడు జరిగిన తమాషాలు. యూనివర్సిటీల్లో లెక్చరర్లు చూపించే పార్షియాలిటీలు...అవీ ఇవీ మాట్లాడుకున్నారు...కబుర్లలో రెండు గంటల కాలం సునాయాసంగా దొర్లిపోయింది.

"ఇప్పుడు చెప్పండి. మీరు వచ్చిన పనేమిటో? .." ప్రసూనను పరిశీలనగా చూస్తూ అన్నాడు మోహన్.

అప్పటి వరకు ఏదోమైకంలో తేలిపోతున్నట్లున్న ప్రసూన ఆ మాటలతో ఉలికి పడింది

" నేనా ? నేను..." అంది అయోమయంగా...మోహన్ నవ్వి "ఏ పని మీద వచ్చారో మరిచిపోయారా ?" అన్నాడు

" నన్ను సాంబశివంగారు పంపించారు..."

"దేనికి ? "

"మా వ్యాపారానికి మీ సహాయం కావాలిట! "

"ఎలాంటి సహాయం ?"

"ఏమో! "

"చట్ట సమ్మతమైనదైతే ఏలాగూ చేస్తాం ! చట్టవిరుద్ధమైనదైతే...అలాంటి సహాయం ఎందుకు కావాలో తెలుసుకోవలసిన అవసరం నాకుంది...అది తెలియకుండా ఏం చెప్పగలను ?"

"డబ్బిస్తానన్నారు..."

ఒక్కసారి తీక్షణంగా చూశాడు మోహన్...ఆచూపులకు తడబడింది ప్రసూన...

"ఈ మాటలన్నది మీరు కనుక...అంటే నిస్సహాయ స్థితిలో ఉన్న స్త్రీ కనుక వదిలి పెడుతున్నామ..."

" అంటే ...... మీరు సహాయం చేయరా ?"

"మీవ్యాపారం ఏమిటో చెప్పమంటున్నానుగా! "

"హోటల్"

"దీనికి పోలీసుల సహాయం అక్కర్లేదు అంతకు మించినదేదో ఉండాలి..."

"నాకు తెలియదు..."

"నమ్మ మంటారా?"

"మీ యిష్టం..."

"కామన్ సెన్స్ ఉన్న వాడెవడు నమ్మడు. ఆ హోటల్లో పని చేస్తున్నారు. సాంబశివంగారికి పర్సనల్ సెక్రటరీగా ఉన్నారు యేమీ తెలీకుండానే వున్నారా? అంతకుముందు తెలియక పోయినా, నా దగ్గిరకు వస్తున్నప్పుడయినా తెలుసుకోవద్దా? ఒకవేళ తెలియక పోతే అది అమాయకత్వం కాదు. మూర్ఖత్వం..."

ప్రసూన మాట్లాడలేదు సాంబశివం మోహన్ దగ్గిరకు వెళ్ళమనగానే ప్రసూన మనసంతా మళ్ళీ మోహన్‌ని కలుసుకోబోతున్న సంభ్రమంతో నిండిపోయి ఉక్కిరిబిక్కిరి అయిపోయింది మరే ఆలోచనా తోచలేదు- ఈ విషయం మోహన్‌కెలా చెప్పగలదు?

వీధిలో కారు హారన్ ఆరోసారి మోగింది

"మీకోసం సాంబశివంగారి కారు చాలా సేపటి నుండి వెయిట్ చేస్తోంది." అన్నాడు మోహన్ లేచి...

(తరువాయి 41 వ పేజీలో)



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నవంబరు 1వ తేదీన "రవీంద్ర భారతి"లో పంచాయతీ రాజ్ రజతోత్సవాలను ప్రారంభించారు. పంచాయతీ రాజ్ శాఖామంత్రి శ్రీ ఎల్. లక్ష్మణ దాస్, ఎక్సైజు శాఖామంత్రి శ్రీ వి. పురుషోత్తమ రెడ్డి, పంచాయతీ రాజ్ ఛాంబర్ అధ్యక్షులు శ్రీ ఎన్. యతిరాజారావులను కూడా చిత్రంలో చూడవచ్చు



ఆర్థిక, సమాచారశాఖా మంత్రి శ్రీ పి రంగారెడ్డి అక్టోబరు 22న న్యూ బాకారంలో అరబిందో బాల కేంద్రా 'నికి శంకు స్థాపన చేశారు సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామ మూర్తి, కార్మిక శాఖామంత్రి శ్రీ టి అంజయ్య, శ్రీ శిశు సంక్షేమ శాఖా మంత్రి శ్రీమతి లక్ష్మీదేవి ప్రభృతులు ఉత్సవంలో పాల్గొన్నారు



# నగరంలో...

గాంధీజీ జయంతి నాడు ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో పది వేల యిండ్ల స్థలాలకు సంబంధించిన పట్టాలను పంపిణీ చేశారు ముఖ్యమంత్రి ప్రధాన అతిథిగాను, రెవిన్యూ శాఖామంత్రి శ్రీ పి నరసా రెడ్డి అధ్యక్షులుగాను పాల్గొన్నారు ఆర్థిక, సమాచార శాఖామంత్రి శ్రీ పి రంగారెడ్డి కార్మిక శాఖామంత్రి శ్రీ టి అంజయ్య మునిసిపల్ పరిపాలన శాఖామంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి పశు సంవర్ధక శాఖా మంత్రి శ్రీ యస్ వెంకట రామారెడ్డి ప్రభృతులు యీ కార్యక్రమంలో పాల్గొన్నారు



ఇండోనేషియా రిపబ్లిక్ నుండి వచ్చిన కాన్సల్ శ్రీ బేగస్ సాగిటో అక్టోబరు 20న ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావును సందర్శించినప్పటి దృశ్యం



కేంద్ర న్యాయశాఖ స్టేట్ మంత్రి డాక్టర్ సరోజినీ మహిషి అక్టోబరు 27న '20వ శతాబ్దంలో తెలుగు సాహిత్యం—రచయిత్రుల సేవ" అనే గోష్ఠికి ప్రారంభోత్సవం చేశారు

కథానిక :

# బాధ్యత

శ్రీమతి పి. సరళాదేవి

ఆ వేళ క్లాసు అతి నిశ్శబ్దంగావుంది పిల్లలందరి హృదయాలూ ఆ పాఠంపట్ల కుతూహలంతో నిండిపోయాయి. మాస్టారి కంఠం ఖంగుమంటూ విన్పిస్తోంది

"అత్రి మహానగరంలో ఒక బక్కచిక్కిన ముసలి గుర్రం ధర్మ ఘంటకు కట్టిన తాటికొసని గడ్డిపరకలు అనుకొని లాగి నమలసాగింది. ఆ లాగుడుకి ఘంట మ్రోగుతోంది. అదివిన్న న్యాయాధిపతి విషయమేమిటో విచారిద్దామని వచ్చేసరికి తాటి కుచ్చు నములుతున్న గుర్రం కనిపించింది అది అతనికి విచిత్రంగానే కాక విచారణాంశంగా కూడా తోచింది. గుర్రానికి అది ధర్మ ఘంట అని తెలియదు అన్యాయం జరిగినప్పుడు మాత్రమే దాన్ని మ్రోగించి న్యాయం పొందాలని తెలియదు. అది బుద్ధిజీవి కాదు గాని అది జీవి. దానికి ఆకలివుంది తాటి కుచ్చును గడ్డి అని భ్రమించేంత ఆకలిలోవుంది. ఆ ఆకలి తీర్చుకోడం కోసం దానిని అది నమలసాగింది. ఆ విధంగా అది తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పక చెప్పింది న్యాయాధిపతి కళ్ళంట నీళ్ళు తిరిగాయి గుర్రపు యజమానిని పిలిపించి చీవాట్లు పెట్టాడు అది వయస్సులో వున్నంత కాలమూ పనిచేయించుకొని, ముసలి తనంలో తిండి పెట్టకుండా వూరివెంట వదిలినందుకు జరిమానా విధించాడు "

ఇంతవరకూ చెప్పిన మాస్టారు కథావేశంలో మునిగిపోయారు.

"చూశారా పిల్లలూ ! ఆ యజమాని ఎంత స్వార్థపరుడో. అది మూగ జీవి తన కష్టం సుఖం చెప్పుకోలేదు వీడో... నాగరికత నేర్చిన మనిషి. గుర్రం మంచి పరువంలో వున్నన్నినాళ్ళూ బాగా పని చేయించుకున్నాడు బాగా సంపాదించాడు ఇప్పుడు ముసలిది అయిపోయిందని, పెట్టిన తిండి కూడా కిట్టుబాటు కాదని వూరిమీద వదిలేశాడు. కొన్ని సంవత్సరాలపాటు తన కుటుంబంలో ఒక సభ్యునిగా బ్రతికింది. తన కుటుంబానికొక ఉపాధిగా నిలిచింది. తనతో కలిసి తోడునీడై బ్రతికింది. అటువంటి జీవి పట్ల కొంచెమయినా మమత లేదు పోనీ మమతా వద్దు అభిమానం వద్దు గానీ కనీసపు బాధ్యతవుండొద్దా? దానికి నోరు లేదనీ, అడగలేదనీ, బ్రతకలేదనీ తెలిసికూడా..."

గంట గణగణ మ్రోగేసరికి టక్కున పుస్తకం మూసేశారు మాస్టారు చుట్టూ చూశారు అప్పటికి పిల్లలలో కూడా చైతన్యం కలిగి బిలబిలలాడుతూ బయలు దేరారు.

నడుస్తున్నాడేగాని ఈ కథంతా రవి మనసులో మళ్ళీ మళ్ళీ తిరగ సాగింది ఆ చిన్నారి హృదయం గుర్రం పట్ల దయతో నిండిపోయింది ఇలాంటి మనిషికి గుర్రం ఎందుకు సేవ చేయాలి? హాయిగా అడవుల్లో ఆకులూ, తీగలూ మేస్తూ, తన జాతి గుర్రాలతో తిరుగుతూ బ్రతికితే ఈనాడీ ఖర్మ పట్టేది కాదుగదా అనిపించింది. ఆ గుర్రం గురించి ఆలోచిస్తూ, ఆ గుర్రం మీద జాలిపడుతూ రవి ఇంటికి చేరేసరికి ఇంట్లోంచి పెద్ద పెద్ద కేకలు వినిపిస్తున్నాయి. తండ్రి గొంతు తారస్థాయిలో వినిపిస్తోంటే భయంగా మెట్ల పక్కనుండి తొంగి చూశాడు తండ్రి పిడికిళ్ళు బిగించిమరీ నాయనమ్మ మీద అరుస్తున్నాడు.

"ఇంత వయస్సు వచ్చినా నీకన్నా బుద్ధి లేదేమమ్మా! పెద్దదానివికదా నువ్వు సర్దుకోకూడదూ. ఇంట్లో ఇరవైనాలుగ్గంటలూ కూర్చుని నువ్వుచేసేది మాత్రం ఏముంది? ఆ వంటా వార్పా ఏదో నువ్వు చూసు కుంటూంటే నీ బ్రతుక్కొక అర్థం పరమార్థం కనిపించవా? ఒక్కరెక్క మీద సంపాదన. నేను మాత్రం ఎంత మందిని వూరికే భరించను! "

"అవును నాయనా ! ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటివెనకాల చచ్చినట్టున్నా బ్రతుక్కి అర్థంఏమిటో పరమార్థం ఏమిటో ఇవాళ నీ దగ్గిరే నేర్చుకోవాలి." అని కళ్ళు తుడుచుకుంటూ నాయనమ్మ వంటగదిలోకి వెళుతోంది.

చూస్తున్న రవికి గుండె గొంతులో కొచ్చింది. రోజూ ఎందుకో ఒకందుకు ఏదో గొడవ జరుగుతూనే వుంటుంది. నాన్న లేనప్పుడు అమ్మా నాయనమ్మ కొట్టుకునే వరకూ వచ్చేస్తారు. అమ్మా స్పష్టంగా అంటుంది—

"క్రిందటి జన్మలో నీ కొడుకేమో గాని ఈజన్మలో నా మొగుడు. నాలుగు వేల రూపాయలు పోసి కొనుక్కున్నాను. నీకిష్టముంటే నోరుమూసుకుని పడుండు. లేకపోతే నీ దిక్కున్న చోటికి పో. "

ఆ మాటలు విని నాయనమ్మ ఏడుస్తూంటే రవికీ ఏడుపొచ్చేది. ఈ గొడవలన్నింటికీ కారణం నాయనమ్మ. అమ్మానాన్నలకు ఆవిడ పని నచ్చదు. ఆవిడ మాటలు నచ్చవు. ఆవిడ బ్రతుకు నచ్చదు. అవన్నీ ఎలావుండాలో అమ్మ చెబుతుంది. నాయనమ్మ వినదు ఆవిడ తమకెంత బరువో అమ్మ, నాన్న చెబుతారు, ఇద్దరూ. ఇవన్నీ రవి చిన్న బుర్రకి స్పష్టా స్పష్టంగా అర్థమవుతూనే వున్నాయి

ఇంత వ్యధాభరిస్తూ నాయనమ్మ ఎందుకిక్కడ వుంటోంది? ఈ విషయం రవికి చచ్చినా అర్థంకావడంలేదు.

అమ్మా నాన్నా బయటికి రాబోతూవుండడం గమనించి రవి చటుక్కున ఇంటి పక్కసందులో దూరాడు. వాళ్ళు వెళ్ళిపోయాక మెల్లగా ఇంట్లోకి వచ్చాడు. పొయ్యి ముందర కూర్చుని నాయనమ్మ

ఇంకా కళ్ళుతుడుచుకుంటూనే వుంది రవిని చూసి కూడా మాట్లాడ లేదు. రవికి తెలుసు-దుఃఖం ఎక్కువగా వున్నప్పుడు నాయనమ్మ ఎవరితోనూ మాట్లాడదని రవికి కూడా ఏడుపొచ్చింది. పక్కకి వెళ్లి కూర్చుని చెయ్యి పట్టుకు నిలాగాడు. ఆవిడ మొగంలోకి చూస్తూ—.

"ఇక్కడుండొద్దు ఎక్కడికయినా పారిపో నాయనమ్మా!" అన్నాడు మనుమడి అభిమానం చూసి నాయనమ్మ కన్నీళ్ళతోనే నవ్వింది మనుమడి తెలివితేటలు తెలుసుకోవాలనిపించి ప్రశ్న వేసింది.

"ఎక్కడికని పోయేదిరా?"

నాయనమ్మ ప్రశ్న తాను తప్పుమాటనలేదన్న ధైర్యాన్నిచ్చింది ఉత్సాహంగాచెప్పాడు

"ఎక్కడికో ఒకచోటికి ఇంత పెద్దభూగోళంలో ఒక మనిషి బ్రతకడానికి కాస్తంత చోటే దొరకదా నాయనమ్మా?"

"చోటు దొరగ్గానే చాలదురా. నాదీ అనేది చిల్లిగవ్వయినా లేనిదాన్ని ఏం తిని బ్రతకనురా?"

రవి చిట్టి బుర్రకు ఈ సత్యం అర్థంకావడానికి కొంత సేపు పట్టింది. అర్థంకాగానే—

"ఇక్కడేం చేస్తున్నావు నాయనమ్మా! అవనే పిపని అవసరంవున్నచోట చేస్తే నీకు సరిపోదా నాయనమ్మా"

నాయనమ్మ తెల్లమొహం వేసింది ఏమంటున్నాడు వీడు? నా తిండి నన్నే సంపాదించుకోమంటున్నాడు? మనుమడి సహజ జ్ఞానం ఆమెకు భయంకలిగించింది సమాజ ధర్మం వాడికి బోధపరచాలనుకుంది. ఇటు తిరిగి, తీరిగ్గా చతికిలబడి మనుమడి రెండు చేతులూ నిమురుతూ, వాడి మొగంలోకి చూస్తూ మొదలెట్టింది

"చూడరా నాన్నా! నేనూ నీలాగే ఒక అమ్మకూ అయ్యకూ పుట్టాను వయస్సు వచ్చాక నాకో జతగాణ్ణిచూసి పెళ్ళిచేశాడు మానాన్న ఆ జతగాణ్ణి, అదే మీ తాతను నమ్ముకొని, అతడికి పుట్టిన మీ నాన్నను నమ్ముకొని జన్మంతా గడిపేశాను కమ్మగా వండి పెట్టాను చల్లగా సేవ చేశాను ఆనందంగా ఇంటిని దిద్దాను వాళ్ళే నావూపిరి వాళ్ళే నా ఆలోచన వాళ్ళేనా ఆందోళన వాళ్ళే నా సంతోషం వాళ్ళే నా సౌభాగ్యం ఇంతెందుకు? వాళ్ళే నా జీవితం వాళ్ళు లేని జీవితమంటూ నాకేమీలేదు నా వయస్సు, నా శక్తి, నాసామర్థ్యమూ అన్నీ వాళ్ళకోసం ఖర్చుచేసి, ఇప్పుడు ఈ ముసలితనంలో నడుంవంగిపోయి చూపు తగ్గిపోయిన ఈ చివరి రోజుల్లో నా కూడు నేను సంపాదించుకోడానికి బయలుదేరాలా నాన్నా!

"ఆడది డబ్బుకోసం, కీర్తికోసం, పదవికోసం పనిచేయడం మన సాంప్రదాయం కాదురా. స్నేహంకోసం చేస్తుంది. అనురాగంకోసం చేస్తుంది ప్రేమకోసం చేస్తుందిరా.

"నాలుగు రోజులు పోతే నీకూ ఒక పెళ్ళాం వస్తుంది అప్పుడు నీకూ తెలుస్తుందిరా పరవళ్ళు తొక్కే ఆ పడుచు ముందు నీ తల్లి ముసలి అత్తగారవుతుంది ఆమె అవసరం నీకూ తగ్గిపోతుంది ఆ తరువాత నీ కొడుకు..."

మరి వినలేక చివ్వున లేచి వీధిలోకి పరుగెత్తాడు రవి బుర్ర గిర్రున తిరుగసాగింది అర్థమయీ అవని ఈ విషయాలన్నీ అతడిని వుక్కిరి బిక్కిరి చేయసాగాయి యావత్తు ఆడజనం మగాడి మీద చేరబడిపోయే ఈ సాంప్రదాయం అతనికి భయం గొల్పసాగింది

ఆ రాత్రి అన్నం తిని పండుకున్నాడే గానీ హాయిగా నిద్ర పోలేదు ఆ కలత నిద్రలో కూడా తాటి కుచ్చు నములుతున్న గుర్రం, వంటగదిలోని నాయనమ్మ, తను ఆడుకుంటూండే పిల్లి పిల్ల, కుర్చీలో కూర్చున్న అమ్మ, అస్పష్ట రూపంతోనున్న పెళ్ళాం వీళ్ళే కాకుండా అప్పచెల్లెళ్లు, కూతుళ్లు, మేనత్తలు, మరదళ్లు వంటి ఏవేవో అస్పష్ట ఆడరూపాలూ అన్నీ గందరగోళంగా అరవసాగాయి భయంతో ఒళ్ళంతా చెమటలు క్రమ్మేశాయి కనపడని సంకెళ్ళేవో కాళ్ళూ చేతులూ బంధించేసినట్టనిపించింది గుండెల మీద పెద్ద బండ ఏదో కూర్చున్నట్టయింది కెవ్వున కేకవేసి లేచి కూర్చున్నాడు రవి

---

**స్త్రీ విద్యావంతురాలయితే ఒక కుటుంబం విద్యావంతమైనట్లే**

---

# వందేమాతరం

## — ముదిగొండ వీరభద్రమూర్తి

### బెంగాలు ఖండం

పలికిరి వల్లమాలిన సభన్ బలుమంది స్వదేశదీక్షితుల్
పలువయె కాదు సూదియును భారత దేశవినిర్మితంబు కా
వలె నని 'జై' నినాదముల పౌరుల్ పల్లెలనుండివచ్చినా
రలు మొరయంగ సత్కరులు రాజమహేంద్రపురీ
వరమ్మునన్

సమితి ముగియ మేకల మందలు, ముగియ నది
పులులు వందలు వందలు పూర్ణజనము
రవము విరిసె 'వందేమాతరమ్మ' బొబ్బ
రింత ప్రభుత నెంచి కనుల యెఱుపు కొంత

నిరుపేదముసలియు నెవడో గాన్గోది క్రొం
బుట్ట మిచ్చెద నన్న ముట్ట ననియె
గెలుపుగ్యారంటీ వకీ లిడెన్ రాజీ ప
డెను కొంప లార్పు కోర్టని యొకండు
పరమ దరిద్రుడే పరదేశ ప్రభుతను
కొలువ నంచు నొకండు కొలువు మానె
నిది గుమాస్తాగిరిన్ సృష్టించు ఫ్యాక్టరీ
విద్యార్థి కాలేజి విడిచె నొకడు.

రై తొకడు సిస్తు చెల్లింపరాదు వనియె
న్యాయవాద వృత్తివిడెద ననియె నొకడు
వంగ సంస్థాప్రబోధ తరంగవతికి
నాద్య వృథుకుల్య త్రవ్విన దాంధ్రజనము

చట్టలేనిది నాల్క చుట్ట చుట్టుకొనె న
యా యన్న నే దమ్మ ననియె నొకడు
పస్తుండవలసె నీవయ్య బియ్య మటన్న
నొకరోజు కేమి పొ మ్మికనె నొకడు

పట్టి యన్నము తిందు మెట్టులు? కూర లే
కన పెరుగున జుఱ్ఱు మనియె నొకడు
ప్రాణము మీదికి వచ్చె మం దమ్మ వే:
యన నేడు దాటదా యనియె నొకడు

నాడు తెఱవడ యేదుకాణమ్ము నెవ్వడు
నాంగ్ల దమననీతిని వంగ సానుభూతి
మత్స్వ దేశ్య చేలాది సంభరణమతి న
దస్సు ఖండించునాడు బందరుపురాన

నాల్గు ద్వారముల నింద్రధను వలంకృతి
దేశ భక్తి కి సీత తెనుగు వ్రాత
మాతృ స్వరూప సమ్యగ్మిళ చ్చిత్రిత
భారత పటపట ధ్వజము కలదు
ప్రతివీథి పొడుగున ప్రజ చేకునందు మే
డలు మిద్దె లెక్కిరి వలను వారు
మంగళ వాద్యంబు మధుర గానంబు 'వం
దే మాతర' మ్మను దివ్యగీతి

మొనసె నభ పతాకాళి వందనము గాగ
విందు వాగ్ధోరణులు స్వరాజ్యేంది రా క
రాగ్ర కమల మధుసారణు లగ్రిమములు
బందరున తెన్గు కల్కటాన్ వంగభాష.

కృష్ణా పత్రిక మున్నుగ
మష్ణంబుగ తెలుగువెలుగు నొగి వెలిగించెన్
ధృష్ణియు కడు సహజంబుగ
విష్ణుని కుడికంటి కాంధ్ర పృథివి యటన్నన్.

ఆర్యసమాజ బోధమున హైదరబాదునఁ గూడ నుద్యమ
స్త్రైర్యము బూరటిల్లియు నిజాం పరిపాలన దుర్దినమ్ములో
నర్యమకాంతి యయ్యెనటు లయ్యు స్వదేశ పటమ్ములే
యటన్
ధార్యము లయ్యె పెక్కురకు తక్కువ యయ్యు
సదక్షపసంగముల్.

దీక్షితు లైతి మేము భవదీయ విధానమునందు వంగహా
ర్యక్షములార! దిగ్విజయ మౌ మన కంచును పెక్కు
జాబులన్
త్ర్యక్షబలమ్ముతో నెనయు నాంధ్రులు వార్తలతోడ పంపినా
రక్షర మక్షరమ్ము ద్రవిణాభరణమ్మున మౌక్తికమ్ముగా

మనమే యనగా మనకం
బె నొక యడుగు ముందు వేసెనే! యాంధ్రము మో
హన బలవీరంధ్రము భే
షనియె సురేంద్రుండు వాగ్మి లద్ధా యనగా.

పరధర్మంబు భయావహంబు భగవద్వాక్యంబిదై గీతలో
పరదేశ్యాంబరధారణంబు నిటు లై వార్యంబు, మా స్పృష్టముల్
కరముల్ గా నివి మావి కా వనుచు చేలంత్రాయికాలిన్ మర
ల్పురి స్త్రీల్ స్త్రీలను, పూరుషుల్ పురుషులన్, జేపెట్టుచున్ బిట్టుగా

మీ చేతి గాజులు మిలమిలలాడుచు
న్నవి క్రొత్తరక మెంత ! నవు రటంచు
ఉంగ్రము తీయకు దొంగి ముట్టి చూచిన
వాలు, రా యెంత ! పసం దటంచు
తో! బాగున్నది, చాలమందియు మణి
క ట్టంట తొడుగుట కంటి మనుచు
వ్యష్టలసొం పొక యెత్తును, కష్టగుం
డీలసొం పొకయెత్తనిజ, మటంచు.

చేయి పట్టి మీ కొక మాట చెప్పవలెనె
చాటుగా నని కొనిపోయి సతులు సతుల
పుంస్తుతులు పుంస్తుతుల బ్రాతి బుద్ధిఁ జెప్పి
పంపినారలు బ్రిటను వల్వకొనవీక.

ఎన్నాళ్ళాయెను మిమ్ము చూచి, సుఖులే యీ రందరున్? మిత్రు లం
దున్నారల్ మనవారు మీ రనిన నెంతో యుత్సుకుల్, రం డ టం
చెన్నండున్ గనపట్టివారి నటుగా చేపట్టి కొంపోయి దె
శౌన్నత్యాగమబోధ్ధ లింటికి నదూరాధ్వంబు పట్టించిరిన్.

బ్రిటను ద్రవ్యము భారత
పటిమ నడచె దాని ముట్టవల దను నట్టిల్
ఘటితమహాశరములు ధ్వజ
పటములుగా పిల్లలకును పఱలెను వేలై.

అనవచ్చు ప్రమిద లటంచు వీనిని కాని
యేతదావళి ప్రజాహృదయరేఖ
అనవచ్చు తైల మటంచు దీనిని వాని
యిది సమగ్రబలమ్ము హృదయభృతము
అనవచ్చు వత్తు లటంచు వీనిని కాని
యివి హృత్తుజిగి వెలయించు కొనలు
అనవచ్చు దీని దీపావళి యని కాని
యిది యెల్ల హృదయాల యేకరశ్మి.

యిటుల పచియించి భారత మెల్లపుడు జ
యించుగావుత మని యెలుగించి సతులు
సుతులు వెలిగించినారు దీపసముదయము
ప్రజల కీ నా డొక రసమ్ము పాయసమ్ము.







# కళా చైతన్యం

అన్ని రంగాలతోపాటుగా ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్ర పరిశ్రమకూడా ముందడుగు వేసింది. చలనచిత్ర అభివృద్ధి సంస్థకు రాజధానిలో కేంద్ర మంత్రి శ్రీ వి. సి శుక్లా ఇటీవల ప్రారంభోత్సవం చేశారు ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళ రావు, రాష్ట్ర ఆర్థిక సమాచార శాఖ మంత్రి శ్రీ పి. రంగారెడ్డి యీ సంస్థ తెలుగు చలన చిత్ర రంగంలో కీలకమైన పాత్ర నిర్వహించనున్నదని అభివర్ణించారు.













## ఈ యేటి మేటి కళాకారులు

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం వారు కేంద్ర మంత్రి శ్రీ వి. సి. శుక్లా హాజరైన ఉత్సవంలో ఉత్తమంగా ఎంపిక చేయబడ్డ చిత్రాల నిర్మాతలకు, దర్శకులకు, కథా రచయితలకు, తదితర కళాకారులకు నంది అవార్డులను బహూకరించారు. ఫాల్కే అవార్డు పొందిన శ్రీ బి. యన్. రెడ్డిని ముఖ్యమంత్రి సత్కరించారు. ఉత్సవం చివర శ్రీ గోపాల్‌తావేఖడ్ వద్ద శిక్షణ పొందిన కళాకారులు నాట్య ప్రదర్శన ఇచ్చారు.










# తెలుగు వాణి

## (ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక)

పుటలు : 1/4 డెమ్మీసైజులో 600

వెల : మేలు ప్రతి రూ 30
పాదా ప్రతి రూ. 10

ప్రాప్తి స్థానం : ప్రపంచ తెలుగు మహాసభల కార్యాలయం.
రెడ్డి మహిళా కళాశాల వద్ద, బర్కాత్‌పురా,
హైదరాబాదు–500004 ఆంధ్రప్రదేశ్.

తెలుగు వారు దేశంలోని వివిధ రాష్ట్రాలలోనే కాక ప్రపంచ మందలి అనేక దేశాలలో నివసిస్తున్నారు. వీరిలో చాలా మంది అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొని ఆయా సంస్కృతీ సంప్రదాయాలను జీర్ణించుకున్నారు. అయినప్పటికీ వారిలో తెలుగు భాషా సంస్కృతీ సంప్రదాయాల పట్ల ప్రేమాభిమానాలు ఏమాత్రం సన్నగిల్లలేదు. ఉగాదినాడు హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు చిరస్మరణీయమైనట్టివి. మైత్రీ సమైక్యతా బంధాలను మరింత పటిష్ఠవంతం చేయడమే కాకుండా తెలుగు సంస్కృతీ వైభవాన్ని ఇవి ఆవిష్కృతం చేశాయి. దేశం నలుమూలల నుంచీ, వివిధ దేశాలనుంచీ తెలుగు వారు వచ్చి తెలుగు సీమను, తెలుగు సంస్కృతీ సంప్రదాయాల సమన్వయ స్వరూపాన్ని దర్శించారు. మహాసభల సందర్భంగా ఏర్పాటైన సదస్సులు, సాంస్కృతిక కార్యక్రమాలు, ప్రదర్శనలు, ప్రసంగాలు వేటికవే విలక్షణమైనట్టివే.

మహాసభలను పురస్కరించుకొని ప్రచురించిన ప్రత్యేక సంచిక 'తెలుగువాణి' లో కూడ ఈ వైలక్షణ్యం ద్యోతక మవుతుంది. కేవలం వ్యాపార ప్రకటనలకు ప్రాధాన్యమీయకుండా ఒక ఉత్తమ గ్రంథంగా దీనిని వెలువరించారు.

సంపాదకీయంలో మహాసభల ఏర్పాటుకు సంబంధించిన చరిత్ర సంగ్రహంగా వివరించడంలో ఆక్షేపణ లేదు గాని అది కొంతస్ఫూర్తిదాయకంగా వుండటం అపేక్షణీయం.

ఇందులో 10 అధ్యాయాలున్నాయి. సంపాదకీయం, సందేశాలు మొదలైనవి తొలిపుటలలో చేర్చారు. చరిత్రా భాగంలో శాతవాహనుల కాలం నుంచి సమగ్ర రాష్ట్ర నిర్మాణం వరకు గల తెలుగు వారి చరిత్రను తెలిపే 16 వ్యాసాలున్నాయి శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, శ్రీ నేలటూరి వెంకట రమణయ్య మున్నగు ప్రముఖుల వ్యాసాలీ అధ్యాయంలో వున్నాయి.

తరువాతి అధ్యాయంలో భాషా సంబంధమైన 12 రచనలు పొందు పరిచారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి, శ్రీ పుట్టపర్తి నారాయణచార్యులు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రభృతుల రచనలిందులో చేర్చారు.

నాల్గవ అధ్యాయం 'సాహిత్యం–ప్రాచీన యుగం'. అయిదవ అధ్యాయం 'సాహిత్యం–ఆధునిక యుగం'. వివిధ సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలు వీటిలో ఆవిష్కృత మయ్యాయి. శ్రీయుతులు వానమామలై వరదా చార్యులు, తిమ్మావఝ్ఝుల కోదండ రామయ్య, నిడుదవోలు వెంకటరావు, సాళ్వ కృష్ణమూర్తి, డా॥ యశోదా రెడ్డి, డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ యస్వీ జోగారావు, డా॥ బి. రామరాజు, డా॥ సి. నారాయణ రెడ్డి, డా॥ దివాకర్ల వేంకటావధాని, డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు, శ్రీ కుందుర్తి వంటి ప్రసిద్ధులు వ్రాసిన 41 వ్యాసాలు వీటిలో చూడవచ్చును. 6వ అధ్యాయం 'సంఘజీవనం'. తెలుగు వారి సాంఘిక జీవనంలోని ప్రత్యేకత లిందులో కాన వస్తాయి. మోటూరి సత్యనారాయణ, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీ కోదాటి నారాయణరావు, శ్రీ జె. వీరాస్వామి తదితరుల వ్యాసాలు 10 దీనిలో చోటు చేసు కున్నాయి. తరువాతి అధ్యాయం 'కళలు'. శ్రీయుతులు సంజీవదేవ్, నటరాజ రామకృష్ణ, కొండూరి వీర రాఘవాచార్యులు తదితరులు తెలుగు వారి లలిత కళావైభవమిందులో వెల్లడించారు. 'రాష్ట్రేతరాంధ్రులు' అన్న 8వ అధ్యాయంలో వివిధ రాష్ట్రాలలో తెలుగు వారిని గురించి అక్కడివారు వివరించారు అలాగే 'విదేశాంధ్రులు' అనే 9వ అధ్యాయం ఇతర దేశాలలో నివసిస్తున్న తెలుగు వారిని గురించి అన్ని సంగతులు తెలియ జేస్తుంది చివరి అధ్యాయం 'రాష్ట్రాభ్యుదయం'. వివిధ రంగాలలో రాష్ట్రం సాధించిన ప్రగతి దీనిలో తెలుపబడింది.

మొత్తం 123 వ్యాసాలున్నాయి. రచయితలందరూ ఆయా అంశాలు సాకల్యంగా తెలిసినవారు.

దీనిలో ప్రధానమైనవి వ్యాసాలే. పద్యాలను వ్యాసాల చివరనున్న భాగంలో ఉట్టంకించారు. తెలుగువారిని గురించిన అన్ని అంశాలను అందించేందుకు జరిగిన ఉత్తమ ప్రయత్నంలో ఈ మార్గమే అనుసరణీయం. అయితే ఉట్టంకించదగిన కవులు కొందరింకా మిగిలిపోయారు. ఏమైనప్పటికీ వ్యాసప్రక్రియనే స్వీకరించడం వల్ల ఈ సంచిక లఘువిజ్ఞాన సర్వస్వంగా రూపొందింది. దానికి తగినట్లు విషయ విభజన కూడా బాగా జరిగింది. తొలి వ్యాసం శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారి 'తెలుగు దేశం'తో ప్రారంభం కావడం కూడ సముచితంగానే వుంది. సంచికకు సమగ్రత సంతరింప చేసేందుకు సంపాదకులు శాయశక్తులా కృషి చేసినట్లు స్పష్టమవుతున్నది. ఆయా రంగాలలో నిష్ణాతులైన వారిచేతనే రచనలు చేయించడం ముదావహమైన విషయం. తప్పక వుండవలసిన కొందరు ప్రముఖులను బహుశః కోరివున్నప్పటికీ వారి వద్దనుంచి రచనలు అందకపోవడంచేత కాబోలు వారి వ్యాసాలు దీనిలో కానరావడంలేదు. చలనచిత్ర కళపై ప్రత్యేక వ్యాసం లేకపోవడం ఏమాత్రం బాగులేదు. బృహత్తరమైన ఈ

సంచిక కూర్పులో ఇటువంటి యిబ్బందులు ఎదురవడం సహజం. వ్యాసకర్తలపరంగా చూసినప్పుడు మరికొంత మంది రచయితలకు అవకాశం ఇచ్చివుంటే సముచితంగా వుండేదేమో ననిపించక మానదు.

సంచికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దేందుకు ప్రతి వ్యాసంలోను కనీసం రెండు చిత్రాలైనా చేర్చారు. ఇవి రేఖా చిత్రాలు కావడం వల్ల ముద్రణ మరింత అందంగా వచ్చింది చిత్రాలు సందర్భోచితంగా వున్నాయి. ఒకటి రెండు సందర్భాలలో చిత్రకారులు మరీ తొందరగా వేసినట్లు తోస్తుంది. అయినప్పటికీ యింత పెద్ద యెత్తున యిన్ని రేఖా చిత్రాలు చేర్చడం ప్రశంసనీయం. సంచికలో చక్కటి వర్ణచిత్రాలు చేర్చి సంచిక అందాన్ని ఇనుమడింపజేశారు. ముఖచిత్ర రచనలో ప్రత్యేకత వున్నదనడంలో సందేహంలేదు. పూర్ణకుంభం, కృష్ణా, గోదావరీ, తుంగభద్ర నదులు, పైర్లు తెలుగుదేశ సౌభాగ్యానికి ప్రతీకలు అదే విధంగా అమరావతిస్తూపం, ఓరుగల్లు హంస, లేపాక్షి బసవన్న తెలుగు కళా ప్రాభవాన్ని చాటుతున్నాయి. గంభీరంగావుండి అందరనీ ఆకర్షించే వృషభరాజం గురించి ఒక్క క్షణం ఆలోచించినట్లయితే అన్నదాతగా ప్రసిద్ధి పొందిన ఆంధ్ర దేశానికి మూలస్తంభం వంటి వాడు కర్షకుడని, అతని బలం వృషభమని స్ఫురిస్తుంది.

గ్రంథ ముద్రణ బాగున్నది. ఎక్కువ వ్యవధి లేనందుచేతనేమో అక్కడక్కడా స్వల్పంగా ముద్రణ దోషాలు దొర్లాయి.

సంచికకు 'తెలుగువాణి' అని పేరు పెట్టడం సముచితంగా వున్నది. ప్రపంచ వ్యాప్తంగావున్న తెలుగువారు ఆనందోత్సాహాలతో కలుసుకున్న శుభ తరుణంలో వెలువరించిన ప్రత్యేక సంచికకు ఈ పేరు అన్ని విధాలా తగివున్నది. తెలుగు ప్రజలకీ సంచిక చక్కటి కానుక. ప్రతి వ్యాసం ఒక మణిపూసగా భాసిల్లుతున్న దనడంలో అతిశయోక్తి లేదు. అందరికీ ఉపయుక్తమైన గ్రంథమిది. ఇట్టి ఉత్తమ సంచికను ఎంతో శ్రద్ధాసక్తులతో రూపొందించి, తెలుగు పాఠకులకు అందించిన సంపాదక వర్గ సభ్యులు, వారికి స్ఫూర్తినిచ్చిన ఆహ్వానసంఘ అధ్యక్షులు ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, కార్యనిర్వాహక అధ్యక్షులు, విద్య, సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అభినందనీయులు.

—జీ రా



## నిరాశలో నిండుగుండె

(32 వ పేజీనుండి)

ప్రసూన మనసంతా ఏదో వెలితిగా అయింది. విధిలేక లేచి నిలబడింది— చేతులు జోడించి బయలుదేరింది.

"మిస్ సూనా!"

ఆ పిలుపుకోసమే ఎదురుచూస్తున్నట్లు చటుక్కున ఆగిపోయింది.

"స్నేహితుడిగా ఒకచిన్న సలహా చెప్పనా?"

"చెప్పండి."

"ఈసారి మీరు ఇలాంటి పనులమీద వచ్చినప్పుడు ఇలా రాకండి... పల్చని నైలాన్ చీర బొడ్డుకిందకు కట్టుకోవాలి..కళ్ళు చెదిరేలా లిప్‌స్టిక్ వగైరాలు అలంకరించుకోవాలి. నవ్వుతూ తుళ్ళుతూ అవసరమయితే ఏదో వంకన తాకుతూ గారాలు పోతూ మాట్లాడాలి. అలా అయితేనేకాని పనులు జరగవు."

మోహన్ పిలవగానే ఆనందంతో ఆగిపోయి వికసించిన ముఖంతో చూసిన ప్రసూన, చూస్తూఉండగా కొయ్యబారిపోయినట్లయింది. సరిగ్గా అప్పుడు కారు హారన్ మళ్ళా మోగింది. ప్రసూన తల వంచుకుని గబగబ కారులో వెళ్ళి కూర్చుంది. కారు కదిలింది.

మోహన్ అటే చూస్తూ అక్కడే నిలబడిపోయాడు. కదులుతోన్న కారును కాదు. ఆ కారులో కూర్చున్న ప్రసూన చెక్కిలిమీదుగా జారుతోన్న కన్నీళ్ళను......

( సశేషం )

# పాఠకుల లేఖలు

అంతర్జాతీయ మహిళా సంవత్సర ప్రత్యేక సంచిక "ఆంధ్ర ప్రదేశ్" అక్టోబర్ 1976 సంచిక ఎంతో ఆకర్షణీయంగాను, విజ్ఞానదాయకంగాను వెలువరించినందుకు ధన్యవాదాలు. ముఖ చిత్రంగా వెలువడిన మహిళా సంవత్సర గుర్తు యొక్క ప్రాముఖ్యతను వివరంగా తెలియపర్చవలసినదిగా కోరుచున్నాను. ముఖ చిత్రం, వెనుక అట్ట, మధ్య పేజీలో ఆఫ్ సెట్ ప్రింటింగ్‌తో మరిన్ని రంగుల బొమ్మలతో ముద్రిస్తే మరింత ఆకర్షణీయంగా ఉండగలదని భావిస్తాను.

అలాగే ఆంధ్రప్రదేశ్ సినిమా పరిశ్రమాభివృద్ధిని గురించి కూడా ప్రత్యేక వ్యాసాలతో ఒక సంచిక వెలువరించవలసినదిగా కోరుచున్నాను.

ఆర్. కె. యమ్. గుమ్మడి.
గుంటూరు.

ప్రస్తుతం వస్తున్న పత్రికల కంటే విజ్ఞానయుతమైన యీ (మీ) పత్రిక ఎంతో గొప్పది అంటే అతిశయోక్తి కాదు. స్వల్ప వెలలో మన ప్రగతికి సంబంధించిన మహోజ్జ్వల పత్రిక మన " ఆంధ్రప్రదేశ్ ".

సంక్షిప్తంగా తెలియజేస్తున్న ఎంతోమంది గొప్పవారి జీవిత చరిత్రలు ఎంతో చక్కగా వుంటున్నాయి. విజ్ఞానాన్ని బోధిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించిన వివరాలు పట్టిక ఎంతో విలువైనది యీ పత్రికలో వెలువరించారు. ధన్యవాదాలు.

'నిరాశలో నిండు గుండె' సీరియల్ మొదటి సంచిక నుండే చాల ఆనందం కలిగిస్తున్నది. రచయిత్రి శ్రీమతి సి. ఆనందారామం గార్కి నమస్కారములు. కాని సీరియల్ చాలా కొద్దిగా వేస్తున్నారు. మరికాస్త కథను ఎక్కువవేసే ప్రయత్నం చేస్తారని ఆశిస్తాను. సీరియల్‌తో పాటుగా ప్రతినెల ఒక కథను కూడా వేస్తే బావుంటుందని నా ఆశ.

మనదేశంలో ఉత్తమ కవులు, ప్రముఖగాయకులు, ప్రతిభావంతులైన చిత్రకళా నిపుణులు ఎంతోమంది వున్నారుకదా, 'ఇంద్ర ధనుస్సు' అనే శీర్షికతో ప్రతి నెలా ఒక్కొక్కరిని పరిచయం చేస్తారని ఆశిస్తాను.

చక్కా వెంకటేశ్వరరావు
నిమ్మకాయల కొత్తపల్లి
అమలాపురం తాలూకా.

ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి "సామాన్యుడి జీవితంలో సరికొత్తమజిలీ'' అనే సందేశం చాలా బాగుంది. ముఖ్యమంత్రి ఈ సందేశంలో ''శ్రుతిమించి రాగానపడే ధోరణిలో'' అన్న ఛలోక్తితో మనదేశంలో సాగుతున్న ప్రస్తుత విషయాలను గురించి చాలా బాగా ప్రసంగించారు. మరియు 20 సూత్రాల పథకాన్ని గురించి కూడా వివరించారు. ఇటువంటి సందేశాన్ని మాకు అందించినందుకు కృతజ్ఞతలు. మీ పత్రికలో వెలువడుతున్న "నిరాశలో నిండు గుండె'' సి. ఆనందరామంగారి సీరియల్ చాలా బాగుంది. ఈ సీరియల్ చదివిన తరువాత మళ్ళీ సీరియల్ ఎప్పుడు వస్తుంది అనే ఆకాంక్షను కలుగ జేస్తుంది. రాజధాని మున్నగు శీర్షికలు చాలా బాగున్నాయి.

పుల్చకోటి బుచ్చారెడ్డి
వెంగళాయ పల్లి, కొల్లాపూర్—లు కా,
మాహబూబు నగర్ జిల్లా.

సెప్టెంబరు నెల 'ఆంధ్రప్రదేశ్' అత్యంత ఆకర్షణీయంగా వుంది. సి. ఆనందరామంగారి సీరియల్ 'నిరాశలో నిండుగుండె' చాలా యింట్రస్టింగ్‌గావుంది. ప్రతినెల ఆంధ్రప్రదేశ్‌ను మన రాష్ట్రంలోని అన్ని గ్రామాల యొక్క పంచాయతీ ఆఫీసులకు పంపితే బాగుంటుంది. ఆయా గ్రామ ప్రజలకు అన్ని విషయాలలో మార్గదర్శకం కాగలదు. మన రాష్ట్రంలో టెలివిజన్ కార్యక్రమాలు చూచే భాగ్యం 400 గ్రామాలలోని ప్రజలకు మాత్రమే కలిగిందని వ్రాశారు. మిగిలిన జిల్లాల గ్రామాలలోని ప్రజలు కూడా అలాంటి అవకాశాలున్నాయా ? వుంటే యెప్పుడువస్తాయి ?

కరేటి మోహన్
సర్వాయపాలెం

ఆంధ్రప్రదేశ్ ప్రతిక సంపాదవర్గమునకందరికి నా హృదయపూర్వకముగా ఈ లేఖ ద్వారా శుభాకాంక్షలను అందజేస్తున్నాను. ఈ నెల ముఖచిత్రం ఏమంత బాగాలేదు. అక్టోబరు 2 సందర్భమున మన బాపూజీ చిత్రం వేసిన ఎంతోబాగుండేదని నా యభిప్రాయము. "అక్టోబర్ నెల'' మహిళా ప్రత్యేక సంచిక చాలబాగుంది. యిందులోని స్త్రీలు-ఉద్యోగాలు అనే వ్యాసంనాకు ఎంతో నచ్చింది. వీరి ఉద్యోగాల గురించి స్త్రీలు పురుషుల తారతమ్యముల ననుసరించి కుటుంబ బాధ్యతలను, పిల్లల బాగోగులను మరియు భార్యా-భర్తలిరువురు చేదోడు వాదోడుగా ఒకరి కొకరు కలిసి కట్టుగా పనిపాటలందును భాగము వహించుచున్నట్లు యిటు స్త్రీల బాధ్యతలను అటు పురుషుల కర్తవ్యాలను విశదీకరించి పాఠక లోకానికి అందజేసిన శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారికి నా హృదయ పూర్వకమైన ధన్యవాదములు.

టి. శంకర్
జహీరాబాద్

# జిల్లాల్లో..

## అధికార, అనధికార సమావేశంలో ఆర్థికమంత్రి ప్రసంగం

ఆర్థిక శాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి, అక్టోబరు 26న ఒంగోలులో జిల్లా పరిషత్తు కార్యాలయంలో అధికార, అనధికారుల సమావేశంలో ప్రసంగిస్తూ జిల్లాలో పంచాయతీరాజ్ రజతోత్సవాల కార్యక్రమాన్నిగూర్చి వివరించారు ఈ ఉత్సవాల సందర్భంగా బీద ప్రజలకు 10 వేల ఎకరాల బంజరుభూమి, 3 వేల ఇండ్లస్థలాల పట్టాలను పంపిణీచేయడం జరుగుతుందని అన్నారు 86 వేల ఎకరాల బంజరుభూమి, భూస్వాములనుండి లభించిన దాదాపు 28 వేల ఎకరాల మిగులు భూమి కూడా త్వరలో పంపిణీచేయడం జరుగుతుందని ఆయన తెలిపారు పాఠశాల భవనాలు, రోడ్ల నిర్మాణం బావుల త్రవ్వకం, మొదలైనటువంటి శాశ్వతమైన పనులను చేపట్టాలని శాసన సభ్యులకు, సమితి అధ్యక్షులకు ఆయన విజ్ఞప్తిచేశారు

జిల్లాపరిషత్తు అధ్యక్షుడు శ్రీ పోతుల చంచయ్య అధ్యక్షత వహించారు.

అంతకుముందు ఆర్థిక మంత్రి ప్రకాశం జిల్లా కళాకారుల సంఘం సమావేశంలో ప్రసంగిస్తూ ఒంగోలులో ఆడిటోరియం నిర్మాణానికి తమవంతు విరాళంగా రూ 25 లక్షలు యివ్వాలని దాతలకు విజ్ఞప్తిచేశారు

జిల్లాస్థాయి సంఘం సమావేశంలో ఈ జిల్లాలో 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం అమలును గూర్చి మంత్రి సమీక్షించారు.

## ఖమ్మంలో మార్కెట్ అభివృద్ధి

మార్కెటింగ్ శాఖ మంత్రి శ్రీ మహేంద్రనాథ్, యిటీవల ఖమ్మంలో మార్కెట్ సంఘ సమావేశంలో ప్రసంగిస్తూ కేంద్ర సహాయ కార్యక్రమం క్రింద ఖమ్మం మార్కెట్ అభివృద్ధికి రూ. 5 లక్షలను ప్రభుత్వం కేటాయించిందని వెల్లడించారు జిల్లాలోని ప్రతి రెగ్యులేటెడ్ మార్కెట్టుకు ఒక బృహత్తర పథకాన్ని తయారుచేయాలని మార్కెటు సంఘానికి ఆయన విజ్ఞప్తిచేశారు. మార్కెట్టు యార్డులో స్థలాలు పొందిన వ్యాపారస్తులు, దుకాణాలు, గోదాముల నిర్మాణం నిమిత్తం వాణిజ్య బ్యాంకులకు విజ్ఞప్తి చేయాలని ఆయన కోరారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అక్టోబరు 26న విజయవాడలో 'ప్రియదర్శిని' మహిళా సూపర్ బజార్‌ను ప్రారంభించారు. సూపర్ బజార్ ఛైర్మన్ శ్రీమతి టి ఇ. ఎస్ ఆనంద బాయిని కూడా చిత్రంలో చూడవచ్చు.

## కొత్త ఎరువులను ప్రవేశపెట్టాలని కలెక్టరు ఉద్బోధ

నెల్లూరుజిల్లా కలెక్టరు శ్రీ సి. అర్జునరావు, నెల్లూరులో మద్రాసు ఎరువుల కంపెనీవారు, కొత్తఎరువులను ప్రవేశపెట్టిన సందర్భంగా జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ రైతుల అవసరాల కనుగుణంగా కొత్త ఎరువులను ప్రవేశపెట్టాలని అన్నారు

మద్రాసు ఎరువుల కంపెనీకి చెందిన శ్రీ కె వి మీనన్ ప్రసంగిస్తూ 30 వేల టన్నుల విజయ 17-17-17, 28 వేల టన్నుల విజయ, 24-24-0, 29 వేల టన్నుల విజయ యూరియాను రాబీ పంటకాలంలో విడుదల చేశారని అన్నారు

## అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా జిల్లాస్థాయి కార్యక్రమాలకు ఆర్థికమంత్రిచే ప్రారంభోత్సవం

ఆర్థికశాఖామంత్రి శ్రీ పి రంగారెడ్డి అక్టోబరు 25న సంగారెడ్డిలో అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఏర్పాటైన జిల్లాస్థాయి కార్యక్రమాలకు ప్రారంభోత్సవం జరుపుతూ ప్రధానమంత్రి నవంబరు 17వ తేదీన హైదరాబాదులో రూ 31 లక్షల ఖర్చుతో ఏర్పాటయిన మహిళల సాంకేతిక శిక్షణా



ఉప రాష్ట్రపతి శ్రీ బి డి. జెట్టి తిరుపతిలో రూ 17 లక్షల వ్యయంతో నిర్మించబడిన శ్రీ వెంకటేశ్వర ఆడిటోరియంకు ప్రారంభోత్సవం చేశారు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, విద్యాశాఖ మంత్రి శ్రీ ఎం వి కృష్ణారావు ప్రభృతులు యీ కార్యక్రమానికి హాజరయ్యారు

---

సంస్థకు ప్రారంభోత్సవం జరుపుతారని చెప్పారు ఈ సంస్థలో మహిళలకు టెక్నాలజీ, టెలివిజన్ రిపేరింగ్ మున్నగువాటిల్లో శిక్షణ ఇవ్వడం జరుగుతుందని ఆయన చెప్పారు

జిల్లాపరిషత్తు సహకార సంఘాలు, విద్య, వైద్య సంస్థలు ఉద్యోగకల్పన విషయంలో స్త్రీలకు ప్రాధాన్యత యివ్వాలని మంత్రి వినతిచేశారు కేవలం స్త్రీలకు మాత్రమే కొన్ని ఉద్యోగాలు ప్రత్యేకించడం మంచిదని ఆయన ఒక సూచన చేశారు దేశంలోఉన్న అపార శక్తిని సక్రియంగా వినియోగపరచినట్లయితే, దేశం త్వరిత గతిని పురోగమిస్తుంది. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానమంత్రి కావడం మహిళాలోకానికే గర్వకారణం స్త్రీల పురోగతికి అవసరమయితే చట్టాల్ని, నిబంధనలను సవరణచేయడం అవసరమని ఆయన అన్నారు

రాష్ట్ర సాంఘిక సలహాసంఘం ఉపాధ్యక్షురాలు శ్రీమతి కస్తూరి కృష్ణంరాజు ప్రసంగిస్తూ స్త్రీలందరూ ఐకమత్యంగా ఉండాలనీ, జాతీయ నిర్మాణ కార్యకలాపాలలో పాల్గొనాలని వినతి చేశారు

## కృష్ణా జిల్లాలో వెనుకబడిన వర్గాలకు ముఖ్యమంత్రి రుణాల పంపిణీ

ముఖ్యమంత్రి శ్రీ జె వెంగళరావు, అక్టోబరు 26 న వెనుకబడిన వర్గాలకు ఆర్థిక సహాయక పథకం క్రింద రుణాలు పంపిణీ చేస్తూ వెనుకబడిన వర్గాలకు సంబంధించిన పథకాలను, ప్రధాన మంత్రి 20 సూత్రాల పథకాన్ని ఉత్సాహంగా అమలు జరుపుతున్నందుకు జిల్లా అధికారులను అభినందించారు

కృష్ణా జిల్లాలో బీదప్రజలకు ఇండ్ల స్థలాల పట్టాలను మంజూరు చేయడం ప్రారంభించారని చెప్పుతూ ఈ కార్యక్రమాన్ని క్రమబద్ధంచేయడానికి ప్రత్యేకంగా ఒక ఆర్డినెన్సును జారీచేశారని అన్నారు గత సంవత్సరం 75 వేల కుటుంబాలకు ఇండ్లస్థలాలు ఇచ్చారు. ఈ సంవత్సరం 4 లక్షల కుటుంబాలకు ఇవ్వాలని ప్రతిపాదించారు 5 ఏండ్లలో ఈ కార్యక్రమాన్ని పూర్తిచేయాలని మేము అభిలషిస్తున్నామని ముఖ్యమంత్రి ప్రకటించారు

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని గూర్చి ముఖ్యమంత్రి ప్రస్తావిస్తూ ఈ విషయంలో ఒక బృహత్తరమైన కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నట్లు తెలిపారు. ఈ సమయంలోనే పంచాయతీరాజ్ సంస్థలను సమీకృతం చేయడానికి, పేదలకు సహాయపడడానికి వీలుగా ప్రధానమంత్రి కార్యక్రమాలను అమలు చేయడానికి ఈ ఉత్సవాలను వినియోగించుకోవడం జరుగుతున్నదని అన్నారు

రాష్ట్రంలో ఆహార పరిస్థితి, ఆహారఉత్పత్తి సంతృప్తికరంగా ఉన్నదని ముఖ్యమంత్రి అన్నారు

జిల్లా రెవిన్యూ అధికారి శ్రీ వెంకటేశ్వరరావు జిల్లాలో 20 సూత్రాల కార్యక్రమం అమలుకు సంబంధించిన నివేదికను ముఖ్యమంత్రికి సమర్పించారు



గవర్నరు శ్రీ ఎస్. ఓబులరెడ్డి అక్టోబరు 17న చిత్తూరు జిల్లా మదనపల్లెలో ఆరోగ్యవరం అభివృద్ధి సంఘానికి ప్రారంభోత్సవం చేశారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అక్టోబరు 17న ఒంగోలు జిల్లాలో మురారి పల్లి రిజర్వాయిర్ పధకానికి ప్రారంభోత్సవం చేశారు. ఆర్థిక, సమాచారశాఖా మంత్రి శ్రీ పి రంగా రెడ్డి, చిన్న తరహా నీటి పారుదలశాఖా మంత్రి శ్రీ ఆనం వెంకట రెడ్డి ప్రభృతులు యీ కార్యక్రమానికి హాజరయ్యారు.

---

విజయవాడ, గుడివాడ, బందరు, నూజివీడు, జగ్గయ్యపేట తాలూకాలలో వెనుకబడిన వర్గాలకు 1,260 ఇండ్ల స్థలాల పట్టాలను ముఖ్యమంత్రి పంపిణీచేశారు

వెనుకబడిన వర్గాలకు చెందిన 203 మంది సభ్యులకు ఆర్థిక పథకాల క్రింద రు 4,19,600 ల విలువచేసే పశువులు, సైకిల్ రిక్షాలు, కుట్టుయంత్రాలు, పాడిపశువులు మొదలైనవాటిని ముఖ్య మంత్రి పంపిణీచేశారు

## నరసంపేటలో తాలూకా పౌరసంబంధ శాఖ కార్యాలయానికి డైరెక్టరు ప్రారంభోత్సవం

సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరు, శ్రీమతి శ్రీరాజ్యంసిన్హా, అక్టోబరు 25న వరంగల్లు జిల్లా నరసంపేటలో తాలూకా పౌరసంబంధ శాఖ కొత్త కార్యాలయానికి ప్రారంభోత్సవం చేస్తూ ప్రభుత్వానికి ప్రజలకు మధ్య పౌరసంబంధాధికారులను ప్రధానమైన అనుసంధానంగా రూపొందించే దృష్టితో పౌరసంబంధ సమాచార శాఖను క్రమబద్ధంచేయడం జరిగిందని తెలిపారు.

సమాచార శాఖను పటిష్టం చేయడంలో ముఖ్యమంత్రి చాలా శ్రద్ధాశక్తులను కనపరుస్తున్నారనీ, రూ 8 కోట్ల బడ్జెట్టును మంజూరు చేశారనీ ఆమె అన్నారు

అన్ని తాలూకాలలో సమాచార కేంద్రాలను ఏర్పాటుచేస్తారు. తాలూకా పౌరసంబంధ శాఖాధికారిని, రేడియో సూపర్‌వైజర్‌లను ఒకే ప్రదేశంలో వుంచిన కారణంగా సామాజిక రేడియో సెట్లను త్వరితగతిని మరమ్మతుచేయడానికి అవకాశం ఏర్పడిందని ఆమె అన్నారు

శ్రీమతి శ్రీరాజ్యం సిన్హాను వరంగల్లులోని టౌను హాలులో చిన్న పత్రికల సంఘం సమావేశంలో సన్మానించారు. ఈ సందర్భంగా జనధర్మ ఎడిటరు శ్రీ యం. యస్ ఆచార్య ప్రసంగిస్తూ ఒకప్పుడు మాతృభూమి సంపాదకులుగా పని చేసిన శ్రీమతి శ్రీరాజ్యం సిన్హాగారు సమాచార శాఖాధికారిగా తగిన వారని అన్నారు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడైన తండ్రిగారి నుండి సేవా తత్పరతను, త్యాగనిరతిని ఆమె పుణికి పుచ్చుకున్నారని ఆయన అన్నారు

శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా ప్రసంగిస్తూ సామాన్య గ్రామీణ ప్రజలకు ప్రాతినిధ్యం వహించే చిన్న పేపర్లను ప్రోత్సహించాల్సిన అవసరాన్ని గూర్చి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు గుర్తించాయనీ,వాటిని ప్రోత్సహించడానికి వీలుగా ఈ సంవత్సరం 198 చిన్న పేపర్లకు రూ 8 లక్షల మేరకు ఎడ్వర్‌టైజుమెంట్లుగా ప్రభుత్వం మంజూరు చేసిందని ఆమె అన్నారు పత్రికా నిర్వహణ ఒక పరిశ్రమలాంటిదని చెప్పుతూ సకాలంలో పత్రికలను వెలువరిస్తూ తమ ప్రమాణాలను పెంపొందించు కోవాలని చిన్నపత్రికల సంపాదకులకు ఆమె సలహా ఇచ్చారు

## స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా బ్రాంచి కార్యాలయానికి ప్రారంభోత్సవం

నెల్లూరుజిల్లా కలెక్టరు శ్రీ సి అర్జునరావు అక్టోబరు 23 న నెల్లూరుకు 16 కిలోమీటర్ల దూరంలోని తోటపల్లి గూడూరులో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 15వ బ్రాంచి కార్యాలయానికి ప్రారంభోత్సవం చేస్తూ గ్రామీణ ప్రాంతాలలో బ్యాంకుల క్రొత్త బ్రాంచి కార్యాలయాలను ప్రారంభించడానికి బ్యాంకుల జాతీయకరణ చేయడం ప్రభుత్వ విధానమని అన్నారు గ్రామాలలోని రైతులకు సకాలంలో రుణాలు యివ్వాలని బ్యాంకు అధికారులకు సలహా యిచ్చారు. సమావేశానికి అధ్యక్షత వహించిన ఇందుకూరుపేట పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ఎ. భక్తవత్సల రెడ్డి ప్రసంగిస్తూ వెనుకబడిన తరగతులవారు, సన్నకారు రైతులు తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకోవడానికి వీలుగా క్రొత్త బ్రాంచి కార్యాలయాలు, పరపతి సౌకర్యాలు కల్పిస్తాయనే ఆశాభావాన్ని వ్యక్తంచేశారు



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అక్టోబరు 19వ తేదీన ఒంగోలులో నిరుద్యోగులకు ఉపాధి పథకం క్రింద ఆటో రిక్షాలను పంపిణీచేశారు.

---

## ఎర్రచెర్వు నిర్మాణానికి శంకుస్థాపన

చిన్నతరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ ఆనం వెంకట రెడ్డి అక్టోబరు 22 న వరంగల్లు జిల్లా పరకాల తాలూకాలోని రాఘవ పూర్‌లో ఎర్రచెర్వు పునర్నిర్మాణానికి శంకుస్థాపనచేశారు దీనిద్వారా 180 ఎకరాల కొత్త ఆయకట్టుకు నీటిసరఫరా జరుగుతుంది నిర్మాణ ఖర్చు అంచనా రూ. 2 38 లక్షలు. రాష్ట్రంలో ఈ సంవత్సరం చిన్నతరహా నీటిపారుదల రంగంలో రూ. 10 కోట్లు ఖర్చుచేస్తారని ఆయన అన్నారు.

## చాగల్లులో డిస్టిలరీ నిర్మాణానికి శంకుస్థాపన

పరిశ్రమల శాఖా మంత్రి శ్రీ పి. బసిరెడ్డి అక్టోబరు 22న చాగల్లులో ప్రభుత్వ డిస్టిలరీ శంకుస్థాపన ఉత్సవానికి అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల సత్వరాభివృద్ధికి అన్నివిధాలా కృషి జరుగుతుందని అన్నారు. ధనిక రైతులు తమ ఆదాయాన్ని పరి శ్రమలలో పెట్టుబడి పెట్టాలని మంత్రి విజ్ఞప్తిచేశారు.

డిస్టిలరీ నిర్మాణానికి శంకుస్థాపనచేసిన ఎక్సైజ్ శాఖామంత్రి శ్రీ వి పురుషోత్తమ రెడ్డి ప్రసంగిస్తూ రాష్ట్రంలో 5.8 కోట్ల లీటర్ల ఆల్కహాల్ అవసరమున్నదనీ దానిలో 3.5 కోట్లు లీటర్లు పరిశ్రమలు వినియోగిస్తున్నాయని అన్నారు. ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న సారాయికి విదేశాలలో మార్కెటు లభించేవరకు దశల వారీగా రాష్ట్రంలో మద్యనిషేధాన్ని అమలు జరుపుతారని ఆయన అన్నారు. ఈ సంవత్సరం ఎక్సైజ్ ఆదాయం 82 కోట్లకు పుండ వచ్చునని మంత్రి పేర్కొన్నారు.

ఎక్సైజ్ శాఖ కమీషనరు శ్రీ అనిల్ దే సదస్యులకు స్వాగతం చెప్పుతూ రూ 75 లక్షల ఖర్చుతో నిర్మించబడుతున్న ఈ డిస్టిలరీ వచ్చే మార్చిలో పని ప్రారంభిస్తుందని అన్నారు రాష్ట్రంలో ఇది మూడవ డిస్టిలరీ. కోస్తా ప్రాంతాలలో అపారంగా లభిస్తున్న బెల్లం తెట్టెను గరిష్ఠస్థాయిలో వినియోగించుకోవడానికి ఈ డిస్టిలరీ ఉద్దేశించబడినది

## గంగనేరు రిజర్వాయరుకు ప్రారంభోత్సవం

చిన్నతరహా నీటి పారుదల శాఖా మంత్రి, శ్రీ ఆనం వెంకటరెడ్డి, అక్టోబరు 18 న రాయచోటి సమీపంలో గంగనేరు రిజర్వాయరుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ రిజర్వాయరు ద్వారా 2,000 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభిస్తుంది

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ నాలుగు సంవత్సరాలలో చిన్నతరహా నీటిపారుదల పనులన్నిటినీ పూర్తి చేయడం జరుగు తుందని అన్నారు రాయచోటి తాలూకాలోని మాండవ్యనదిపై నీటి పారుదల పథకం, కుశవతి ప్రాజెక్టు నిర్మాణం త్వరలోనే చేపడ్తారు రిజర్వాయరు పథకంలో భాగంగా గంగనేరుపై వంతెన నిర్మించాలని మంత్రి అక్కడికక్కడ నిర్ణయం చేశారు

జిల్లా కలెక్టరు శ్రీ పి. ఎల్. సంజీవరెడ్డి ప్రసంగిస్తూ భూగర్భ నదీజలాల సర్వేకు, జిల్లా భూభౌతిక పటం తయారీకి కేంద్ర ప్రభుత్వం నుండి మంజూరీ లభించిందని అన్నారు

## కడప జిల్లా పరిషత్తు సర్వసభ్య సమావేశం

పరిశ్రమల శాఖా మంత్రి, శ్రీ పి బసిరెడ్డి, అక్టోబరు 18న కడపలో జిల్లా పరిషత్తు సర్వసభ్య సమావేశంలో ప్రసంగిస్తూ ఖాదీ బోర్డు క్రింద ఉన్న రుణాల బకాయీలన్నిటినీ వసూలు చేయాలని కలెక్టర్లకు ఉత్తర్వులు జారీ చేశారనీ, యీ సందర్భంలో జిల్లా పరిషత్తు తమ సహాయ సహకారాలను అందజేయాలనీ అన్నారు. కడపలో విద్యుచ్ఛక్తి సర్కిల్ కార్యాలయాలను యితర చోట్లకు మార్చకుండా ప్రయత్నం చేస్తారని మంత్రి హామీ ఇచ్చారు.

జిల్లా కలక్టరు శ్రీ సంజీవరెడ్డి జిల్లాలో ఆహార పరిస్థితిని గూర్చి సమీక్షిస్తూ ఆహార ధాన్యాల అక్రమ రవాణాను అరికట్టడానికి చర్యలు తీసుకోవడంతోపాటు అదనంగా బియ్యం, చక్కెర, గోధుమలు సేకరించడానికి చర్యలు తీసుకున్నారని అన్నారు. తీవ్రతర అభివృద్ధి సాధనకు వీలుగా మూడు రెవిన్యూ డివిజను లలో ఐదు గ్రామపంచాయితీల చొప్పున దత్తం చేసుకుని ప్రభుత్వ శాఖలన్నిటితో పాటు బ్యాంకులు సహకార సంఘాలు యిక్కడ



ఇటీవల రాష్ట్ర మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కడపజిల్లా రమణపల్లి వద్ద న్యూ హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు జిల్లా కలెక్టరు శ్రీ పి. యల్. సంజీవరెడ్డి ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు

తమ కార్యక్రమాలను అమలు జరుపుతాయి. ఆదర్శప్రాయంగా యీ గ్రామాలను అభివృద్ధి చేయడం జరుగుతుంది.

## ఒంగోలులో ముఖ్యమంత్రిచే ఆటోరిక్షాల పంపిణీ

ముఖ్యమంత్రి, శ్రీ జె వెంగళరావు, అక్టోబరు 19న ఒంగోలులో బహిరంగ సభలో ప్రసంగిస్తూ ప్రధాన మంత్రి ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని ప్రభుత్వం పటిష్టవంతంగా అమలు జరుపుతుందని అన్నారు. వెనుకబడిన వర్గాల అభ్యున్నతికి ప్రధానమంత్రిని బలపర్చాల్సిన సమయం ఆసన్నమైందని ఆయన అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన ఆర్థిక మంత్రి, శ్రీ పి. రంగారెడ్డి ప్రసంగిస్తూ అత్యవసర పరిస్థితి ప్రకటించడానికి గల కారణాలను వివరించారు ప్రధానమంత్రి సకాలంలో చర్యలు తీసుకోవడం వల్ల జాతి రక్షించబడిందని ఆయన అన్నారు. ధరల స్థిరీకరణ, వెనుకబడిన వర్గాలకు యిండ్ల స్థలాల పంపిణీ-యీ రెండూ అత్యవసర పరిస్థితిలో సాధించిన ఫలితాలు. కల్తీ, దొంగ వ్యాపారానికి పాల్పడరాదని వ్యాపారస్థులను హెచ్చరించారు. 15,000 మంది ప్రజలతో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది.

అంతకు ముందు శ్రీ జె. వెంగళరావు, కళాశాలలో కీ. శే. చెంచురామానాయుడు చిత్ర పటాన్ని ఆవిష్కరించారు.

ప్రకాశం భవనంలో జరిగిన ఉత్సవంలో ఒంగోలు ఆటోరిక్షా డ్రైవర్ల సంఘం సభ్యులకు ముఖ్యమంత్రి ఆటోరిక్షాలను పంపిణీ చేశారు. ఆటోరిక్షా ఖరీదులో 85 శాతం స్థానిక సిండికేటు బ్యాంకు, పదిశాతం ప్రభుత్వం, ఐదుశాతం ఆటోపొందిన వ్యక్తి భరిస్తారు. 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం అమలును ముఖ్యమంత్రి వీక్షించారు.

## శ్రీకాకుళంలో మత్స్యపారిశ్రామికులకు ఆర్థిక సహాయం

పంచాయతీరాజ్య శాఖ మంత్రి శ్రీ యల్. లక్ష్మణదాసు, అక్టోబరు 22న శ్రీకాకుళంలోని జిల్లా పరిషత్తు హాలులో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ బీద ప్రజలు, బడుగు వర్గాలు ముఖ్యం? మత్స్యపారిశ్రామికులు, సన్నకారు రైతుల ఆర్థిక అభ్యున్నతి



హరిజన, గిరిజన సంక్షేమ, సాంకేతిక విద్యాశాఖ మంత్రి శ్రీ ఖాట్టం శ్రీరామమూర్తి అక్టోబరు 6వ తేదీన కర్నూలు పంచాయతీ సమితిలోని పంచలింగాల గ్రామ హరిజనులకు యిండ్ల స్థలాల పట్టాలను పంపిణీ చేశారు.

---

ప్రధానమంత్రి ఎంతో శ్రద్ధవహిస్తున్నారని అన్నారు. పేదలకు అవసరమైనవారికి రు 73 లక్షల మేరకు ఆర్థిక సహాయం అందజేయబడిందని ఆయన అన్నారు. కష్టించి పనిచేయాలని మత్స్య పారిశ్రామికులకు మంత్రి విజ్ఞప్తి చేశారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ పి. రాజశేఖరం సమావేశానికి అధ్యక్షత వహించారు. సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ క్రింద నైలాన్ దారం, రొక్కం మొత్తాలను పంపిణీ చేశారు.

శ్రీకాకుళం జిల్లా షేరుమహ్మద్ పంచాయతీ సమితిలోని ధల్లిపేటకు చెందిన వ్యవసాయకూలీలకు, యాదవులకు దున్నపోతులు, గొర్రెల కొనుగోలు నిమిత్తం వరుసగా రు 3 వేలు, రు 2,700 లకు చెందిన చెక్కులను మంత్రి పంపిణీ చేశారు.

## మిత్రమండలికి ప్రారంభోత్సవం

కరీంనగరం జిల్లా తోటపల్లి గ్రామంలో తేదీ 2-9-75 మంగళవారము ఉదయము 9-45 గంటలకు "సారస్వత జ్యోతి మిత్రమండలి" తోటపల్లి శాఖకు ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ, రవాణా శాఖా మాత్యులు గౌరవనీయులైన శ్రీ చొక్కారావుగారు జ్యోతిని వెలిగించి ప్రారంభించారు. జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు శ్రీ బి. వెంకటరామారావు గారు సభకు అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా సుప్రసిద్ధ సాహితీవేత్త డాః దివాకర్ల వేంకటావధాని విచ్చేశారు.

మంత్రిగారు ప్రసంగిస్తూ మన భారతదేశము పేద దేశము. మన ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమమును ముమ్మరము చేయవలసినదిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

గ్రామాలలో కుటీర పరిశ్రమలు, వ్యవసాయ దారులకు చిన్న మొత్తాల ఋణసౌకర్యం, గ్రామీణాభివృద్ధి మొదలగు విషయములు ప్రధాని ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమములో కలవని మంత్రిగారు చెప్పారు.

యువకులనుద్దేశిస్తూ, దేశ సౌభాగ్యమునకు, గ్రామాలలో నిర్మాణ కార్యక్రమములయందు తగినంత శ్రద్ధ చూపవలసినదిగా సూచించారు.

## గుడివాడలో గాంధీ జయంత్యుత్సవం

గుడివాడలో రెవిన్యూ డివిజనల్ ఆఫీసు ఆవరణములో జరుపబడిన గాంధీ జయంత్యుత్సవమునకు, కృష్ణా జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు అధ్యక్షత వహించారు. కృష్ణా జిల్లాలో పేదవారికి ప్రతినెలా 2000 నివేశన స్థలాల పట్టాలు ఇచ్చేకార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించుచున్న కృష్ణా కలెక్టరు గారి అవిరళ కృషిని శ్రీ పిన్నమనేని స్తుతించారు. గుడివాడ రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, శ్రీ వి. యస్. శంకర నారాయణ గుడివాడ, కైకలూరు తాలూకాలకు చెందిన హరిజనులకు వెనుకబడిన తరగతులవారికి 522 నివేశ స్థలాల పట్టాలు ఇచ్చారు. శ్రీ కాజా రామనాథం యం. యల్. ఏ. ముదినేపల్లి 10 పాడి పశువులను శ్రీ కఠారి సత్యనారాయణ, యం. యల్. ఏ., గుడివాడ 1000 బాతులు 1185 కొబ్బరి మొక్కలు మరియు 6 కోళ్ళయూనిట్లు, శ్రీ పి. యల్. సుబ్బయ్య, సబ్ జడ్జి, గుడివాడ, హాస్టలు పిల్లలకు బట్టలు, శ్రీ బి. రామలింగేశ్వరరావు, అసిస్టెంటు పోలీసు సూపరింటెండెంటు, గుడివాడ, గుడివాడ రజక జనసేవా సహకార సంఘములో 20 మందికి ఇస్త్రీ పెట్టెలు, నాయీ బ్రాహ్మణ సహకార సంఘంలో 10 మందికి రివాల్వింగ్ కుర్చీలు కైకలూరు తాలూకా నాయీ బ్రాహ్మణ సహకార సంఘ సభ్యులు 10 మందికి సంగీత వాయిద్య పరికరాలు ఇచ్చారు. ఈ సందర్భమున శ్రీ యం. వి. నరసింగరాజు, కైకలూరు పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ వల్లభనేని రామబ్రహ్మం, శ్రీమతి వి. సీతామహాలక్ష్మమ్మ ప్రధాని 20 సూత్రాల కార్యక్రమాన్ని బలపరుస్తూ మాట్లాడారు. శ్రీ బి. సూర్యనారాయణ గుడివాడ తహసిల్దారు స్వాగతం పలికారు. సభానంతరం గుడివాడలోని శ్రీ సిద్ధేంద్ర నాట్య కళాశాల విద్యార్థులు రాత్రికి కూచిపూడి నాట్యం ప్రదర్శించారు.

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING GOVT OF ANDHRA PRADESH AT THE GOVT CENTRAL PRESS HYDERABAD

రిజిస్టరు నెం. హెచ్/హెచ్ డి. 81

స్వాతంత్ర్యాన్ని పోరాడి తెచ్చుకున్నాం అని చెప్పి నిశ్చింతగా ఉండకూడదు. వెయ్యి కళ్ళతో ప్రతిక్షణం దాన్ని రక్షించుకోవాలి. స్వాతంత్ర్యంకోసం పోరాడటానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి.

—ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ